శ్రీ

# తొలిపలుకు

---

ఈ నిఘంటుత్రయ సంపుటమునఁ బైడిపాటి లక్ష్మణకవి వ్రాసిన యాంధ్రనామ సంగ్రహము, అడిదము సూరన కవి వ్రాసిన యాంధ్రనామశేషము, కస్తూరి రంగకవిచే వ్రాయఁబడిన సాంబనిఘంటువుఁ గూర్పఁబడినవి. దాదాపు ముఖ్యములైన యాంధ్రపదములన్నియు నీ మూఁడు గ్రంథములయందును వచ్చినవని చెప్పవచ్చును. ఒకరు విడిచిన పదజాలమును రెండవవారును, మొదటి యిరువురును విడిచిన పదజాలమును మూఁడవవారును గూర్చుటచే నీ నిఘంటుత్రయమున నాంధ్ర పదజాలమునఁ బెద్దభాగము జేర్కొనఁబడిన దనుటకు సందియములేదు. ఆంధ్రభాషాపేక్ష గలిగిన ప్రతి వ్యక్తియు నొక్కతూరి యీ గ్రంథమును జదువుట యత్యంతావశ్యకము. ప్రతి గ్రంథాంతమందునను నుండఁదగిన 'అ'కారాది శబ్దానుక్రమణికలను నిఘంటుత్రయాంతమున నొకతావుననే యనుసంధానము సేసితిని.

పదజాలముయొక్క అర్థస్వరూపము, ఆంగ్లభాషావిదులకు సులభముగా బోధపడునట్లు, నామ లేఖనానంతరమున ఆంగ్ల భాషలో నిరూపింపఁబడినది.

ఇట్లు,
సహస్రావధాన చతురానన
జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి.

# హెచ్చరిక.

---





శ్రీరస్తు

# ఆంధ్రనామసంగ్రహము

—:O:—

ప్రతిపదార్థసహితము.

శ్రీ పైడిపాటి యేకామ్రమంత్రికుమారుఁడగు పైడిపాటి లక్ష్మణకవి యీ యాంధ్రనామ సంగ్రహమును వ్రాయఁబూని, యిష్టదేవతా నమస్కారమును జేసి, నిర్విఘ్నసమాప్తికై గణనాథునిఁ దలంచి, మూఁడు పద్యములతో "మంగళాదీని, మంగళమధ్యాని, మంగళాంతాని కావ్యాని" యను సూక్తి ననుసరించి గ్రంథాద్యాచారమైన మంగళాచరణమును జేయుచున్నాఁడు. రెండవ పద్యమున సుగుణసంపత్తిగల తన కృతిపతిని బేర్కొనుచున్నాఁడు. మూఁడవ పద్యమునఁ గవి తన నామమును, గ్రంథనామమును, దన భాషాలోకోపకారకమైన యుద్యమమును బేర్కొనుచున్నాఁడు.

క॥ శ్రీపతివంద్యు, విశాలా
క్షీపతిని భజించి, యిష్టసిద్ధులు వరుసన్
బ్రాపింపఁగ గణనాథుని
శ్రీపాదంబులకు నెరఁగి చెందిన వేడ్కన్. 1

క॥ నతభక్త లోకరక్షా
రతికిన్, జంచత్కృపాతరంగిత మతికిన్,

శతమఖముఖ సురనుతి సం
గతికిన్, మహిమోన్నతికిని, గాశీపతికిన్. 2

తే॥ అంకిత మొనర్తుఁ దెనుగు పే ళ్ళరసి కూర్చి
గరిమతో నాంధ్రనామసంగ్రహ మనంగ
నమరు కృతిఁ; బైఁడిపాటి యేకామ్రమంత్రి
సు తుఁడఁ; గవి లక్ష్మణాఖ్యుఁడ; సుజనహితుఁడ. 3

తాత్పర్యము:—శ్రీమహావిష్ణువుచేత బూజింపఁబడునట్టియు విశాలాక్షీ హృదయేశ్వరుఁడునగు విశ్వేశ్వరుని మనసార ధ్యానించి, క్రమక్రమముగ నభీష్టసిద్ధిసేయుటకొఱకు విఘ్నేశ్వర శోభాయుక్తములగు పాదములకు నమస్కరించి, సంతుష్టాంతరంగుండనై,

2. నమస్కరించు భక్తలోకమును రక్షించుటయందు నాసక్తిగలిగినట్టియుఁ, బొరలి వచ్చు కృపారసతరంగమునందు దేలియాడు మనస్సుగలిగినట్టియు, యింద్రుఁడు మొదలగు దేవతలచేత సర్వదా నుతింపఁబడునట్టియు, గొప్ప మహిమ గలిగినట్టియుః కాశీ విశ్వేశ్వరునకు

3. తెనుఁగు శబ్దములకు పర్యాయ పదములు వెదకి కూర్చి, బుద్ధివిశేషము నుపయోగించి, ఆంధ్రనామసంగ్రహమను పేరుగల గ్రంథమును రచించి, అంకితము సేసి యిచ్చెదను. నేను పైడిపాడి యేకామ్రమంత్రి కుమారుఁడను. సుజనులకిష్టుఁడను. పైడిపాటి లక్ష్మణకవి యను పేరుగలవాఁడను.

అవతారిక : గ్రంథకర్త తాను రచియింపఁ దలఁచిన గ్రంథమునందలి పరిభాషను దెలుపుచున్నాఁడు.

తే॥ దేవ మానవ స్థావర తిర్యగాఖ్య
వర్గు లొనరింతు నానార్థవర్గుఁగూడ;
వర్గములుగాఁగఁ గూర్తు నాహ్వాయమునందు
నిడుదు వివరించునెడల సంస్కృతపదంబు. 4

"ఈ యాంధ్రనామసంగ్రహమున దేవవర్గు, మానవవర్గు, స్థావరవర్గు, తిర్యగ్వర్గు, నానార్థవర్గు అను నైదువర్గులుగూర్చెదను. పర్యాయ పదములన్నియు నాంధ్రశబ్దములుగను, అర్థమును దెలుపు శబ్దము సంస్కృత శబ్దముగను గూర్చెదను" అని గ్రంథ కర్తృ వాక్యము.

దేవవర్గునందు శివుడు మున్నగు దేవతల పేర్లుండును. దేవతా సంబంధములైన యితర పదార్థముల పెర్లును జెప్పఁబడును. మానవవర్గునందు మానవులును మానవులకు సంబంధించిన పదార్థములును జెప్పఁబడును. స్థావరవర్గునందు, పర్వతములు, వృక్షములు మున్నగు స్థావరపదార్థముల గుఱించి చెప్పఁబడును. తిర్యగ్వర్గునందుఁ బశుపక్ష్యాది తిర్యగ్జంతువుల పేర్లును వానికి సంబంధించినవానిని గుఱించియు జెప్పఁబడును. నానార్థవర్గునందు అనేకార్థములుగల పదములనుగూర్చి చెప్పఁబడినది.

క॥ శ్రీలలనాధిపవంద్యా! వి
శాలాక్షీ ప్రాణనాథ! శతమఖముఖ ది
క్పాలాభీష్టద! సముధిక
శీలా! కాశీనివేశ! శ్రీవిశ్వేశా! 5

తా॥ లక్ష్మీదేవికిఁ బ్రాణేశ్వరుఁడగు శ్రీమహావిష్ణువుచేత నమస్కరింపఁబడఁదగినవాఁడవు. కాశీ విశాలాక్షి యను పేరుగల

పార్థివవినుత ప్రపన్నార్తిహరుండవు. [illegible] మొదలగు దిగ
వస్తుల కొరకు చెప్పువాడవు. మహనీయమైన శీలముగల
వాడవు. కాశీపురవాసులయునగు శోభాయుక్తుండవైన విశ్వేశ్వరా!
అవధరింపుమని అక్కలకవి తన కృతిపతియగు విశ్వేశ్వరుని సం
బోధించి చెప్పుచున్నాడు.

## దేవవర్గు

Section mentioning the names of Devas
and their belongings.

సీ॥ ముక్కంటి యఱపదిమోము వేలుపు,
మినుసిగదయ్యంబు, మిత్తిగొంగ,
గట్టువిల్తుఁడు, గఱకంఠుఁడు, మిక్కిలి
కంటిదేవర, బేసికంటివేల్పు,
వలిమల్లుఁడు, మిన్ను వాఁకతాలుపు కొండ
వీటిజంగము, గుజ్జువేల్పు తండ్రి,
వలరాజుసూఁడు, జక్కులజేనిచెలికాఁడు,
బూచులయొకిమీఁడు, పునుకతాల్పు,

గీ॥ విసపుమెతరి, జన్నంపువేఁటకాఁడు,
బుడుతనెలతాల్పు, వెలియాలపోతురౌతు,
తోలుదాలుపు ముమ్మొనవాలుదాల్పు
నాఁగ భవదాఖ్య లొప్పు (నంధకవిపక్ష!) 6

**Siva**

టీ॥ ముక్కంటి=మూఁడుకన్నులుగలవాఁడు, (ఇది బహు
వ్రీహి సమాసము.) "బహువ్రీహిని సమాసాంత కార్యములు

చూపట్టెడి''అను బాలవ్యాకరణ సమాస పరిచ్ఛేదమునందలి 23వ సూత్రముచే 'ముక్కంటి' యను రూపము సిద్ధించెను. అరపది మోములవేలుపు=అయిదు మొగములుగల దైవము, మినుసిగ దయ్యంబు=గగనమే సిగగా గలిగినదైవము, మిత్తిగొంగ= మృత్యువునకు శత్రువు, గట్టువిల్తుఁడు=త్రిపురసంహారకాలమున మేరు పర్వతమును విల్లుగాఁ బట్టినవాఁడు. కఱకంఠుఁడు=నల్లని కంఠము గలవాఁడు. (అర్థ్యవ్యవహారంబు గ్రాహ్యంబు. బాల వ్యాకరణ సంజ్ఞాపరిచ్ఛేదము 23వ సూత్రము.) మిక్కిలి కంటి దేవర=ఎక్కువకన్ను గలదైవము, బేసికంటివేల్పు= (మూఁడు) బేసి సంఖ్యయైన కన్నులుగలదేవుఁడు; వలిమలల్లుఁడు=మంచు కొండయొక్క అల్లుఁడు; మిన్నువాఁకతాల్పు=ఆకాశగంగనుధరిం చినవాఁడు; కొండవీటి జంగము=కైలాస పర్వతమున నివసించు భిక్షుకుఁడు, గుజ్జువేల్పుతండ్రి=వినాయకుని తండ్రి, వలరాజు సూఁడు-మన్మథుని విరోధి, జక్కులఱేని చెలికాఁడు=యక్షేశ్వ రుఁడగు కుబేరునిమిత్రుఁడు, బూచులయెకిమీఁడు=పిశాచములకు అధిపతి, పునుకతాల్పు=కపాలమును ధరించువాఁడు, విసపు మేఁతరి=విషము దిన్నవాఁడు, జన్నంపు వేఁటకాఁడు=(దక్షుని) యాగమును ధ్వంసము సేసినవాఁడు. ''కర్మధారయమున మువ ర్ణమునకు=బుంపు లగు. ''బా. సంధి. 32వ సూత్రము. బుడుత నెలతాల్పు=బాలచంద్రుని ధరించినవాఁడు; వెలియాలపోతు రౌతు=తెల్లని వృషభము నెక్కుజోదు. తోలుదాలుపు=పులిచర్మ మును దాల్చువాఁడు. ముమ్మొనవాలుదాల్పు=మూఁడు మొనలు గల యాయుధమునుధరించినవాఁడు, (త్రిశూలధారి). నాఁగఁ= అను నీ పేర్లన్నియు, అంధకవిపక్ష!=అంధకాసురునకు శత్రుఁడ

[illegible] పేరుగా, ఒప్పుగ=చెల్లును,
[illegible] పేళ్లు. Siva.

సీ॥ సోఁకుమూఁకలగొంగ, చుట్టుఁగైదువుజోదు,
వచ్చవిల్తునితండ్రి, లచ్చిమగఁడు,
పులుఁగుతత్తడిరౌతు, వలమురితాలుపు,
వెన్నుఁడు, కఱివేల్పు, వెన్నదొంగ,
నునుగాడ్పుదిండిపానుపునఁ బండెటి మేటి,
బమ్మదేవరతండ్రి, తమ్మికంటి,
పదివేసముల సామి పసిఁడిపుట్టముదాల్పు,
కత్తినెచ్చెలి, తఱిగట్టుదారి,
తే॥ ఆలకాపరి, వ్రేఁతలమేలువాఁడు,
పాలకడ లల్లుఁడును బక్కిడాలువేఁడు,
జేయుఁబవలును జేయుకన్దోయివాఁడు,
మామమామన హరి యొప్పు (శ్రీమహేశ!) 7

టీ॥ సోఁకుమూఁకలగొంగ=రక్కసి తండములకు విరోధి; చుట్టుఁగైదువుజోదు=గుండ్రనియాయుధమును ధరించుయోధుఁడు "సమాసమున నుపంత స్త్రీసమంబులకుఁ బరుష సరళములు పరములగునపుడు నుగాగమంబగు, బా. సంధి. 24వ సూత్రము." పచ్చవిల్తుని తండ్రి=పచ్చని విల్లుగల మన్మథునకుఁదండ్రి; లచ్చి మగఁడు=లక్ష్మీదేవికి భర్త; పులుఁగుతత్తడిరౌతు=పక్షివాహనము నెక్కు యోధుఁడు, వలమురితాలుపు=పాంచజన్య మను శంఖమును ధరించువాఁడు, వెన్నుఁడు=అంతటవ్యాపించువాఁడు, కఱివేల్పు=నల్లని మైచాయగలదేవుఁడు, వెన్నదొంగ=(గోపాల రూపంబున) గోపికాగృహములందు వెన్నను దొంగిలించిన చోరుఁడు;

నునుగాడ్పుదిండి పానుపునఁ బండెడు మేటి=మృదువైన వాయువును భక్షించెడు శేషుని< దల్పముగాఁ జేసి పండెడు దొర; బమ్మదేవరతండ్రి=బ్రహ్మదేవునకు జనకుఁడు, తమ్మికంటి=పద్మముల వంటి కన్నులుగలవాఁడు, పదివేసములసామి = దశావతారము లెత్తిన వేలుపు, పసిడిపుట్టముతాల్పు=బంగారమువలె పచ్చనైన వలువను ధరించెడివాఁడు. కవ్వినెచ్చెలి=అర్జునునకుఁ జెలికాఁడు. తరిగట్టుదారి-పాలసముద్రమును దచ్చిన మందరపర్వతమును ధరించినవాఁడు, ఆలకాపరి=గోవులనుగాయు గోపాలుఁడు. (బహువచనము పరమగునపుడు ఆవు ప్రభృతుల తుది యక్షరంబునకు లోపంబగు.) బా. అచ్చిక, 21 సూత్రము. వ్రేఁతలమేలు వాఁడు = గోపికాస్త్రీలను దయతోఁ గాచినవాఁడు, పాలకడలి యల్లుఁడు=క్షీరసముద్రమునకుఁ గూఁతురగు లక్ష్మీదేవికి మగఁడు, పక్కిడాలుఱేఁడు=గరుడధ్వజుఁడైన ప్రభువు, రేయుఁబవలును జేయు కన్దోయివాఁడు=చంద్రసూర్యలోచనుఁడు, మామమామ= సముద్రమునఁ బుట్టిన లక్ష్మీదేవికి మగఁడయి యుట్లుఁతన మామ యగు సముద్రునకుఁ దన పాదమునఁ బుట్టి పుత్రికయైన గంగ నొసంగుటచే మామకు మామగారు, అనఁ=అనఁగా, ఓ శ్రీమహేశా! హరి యొప్పును=విష్ణుమూర్తి యగును. Lord Vishnu

సీ॥ పక్కిడాల్వేలుపు పొక్కిలిపసిబిడ్డ,
డంచదేజీనెక్కి యాడురౌతు,
మనెడు ప్రొద్దులనొసళ్ళను వ్రాయుదేవర,
చదువులవేలుపు, జన్నిగట్టు,
తెలిదమ్మిగద్దియ కొలువుండురాయఁడు,
నిక్కపు జగమేలు నేర్పుకాఁడు,

కడుపు బంగారుబొక్కసముఁజేసిన మేటి,
పోరోగిరము తిండిపోతుతండ్రి,
ఆ॥ నలువ, తమ్మిచూలి, నలుమొగంబులవేల్పు,
వేల్పుపెద్ద, పలుకువెలఁదిమగఁడు,
తాత, బమ్మ, యన విధాతనామము లొప్పు
నఘవినాశ ! యీశ ! యభ్రకేశ ! 8

టీ॥ పక్కిడాల్వేలుపు పొక్కిలి పసిబిడ్డఁడు=గరుడధ్వజుఁడైన (విష్ణు) దేవుని బొడ్డుతమ్మియందు బుట్టిన శిశువు, అంచతేజీనెక్కి యాడు రౌతు = హంసవాహనమునెక్కి తిరుగు జోదు, మనెడు ప్రొద్దుల నొసళ్లను వ్రాయు దేవర= (నరుల) బ్రతుకు దినములను ఫాలతలములయందు వ్రాయు వేలుపు, చదువుల వేలుపు=విద్యాధిపతి, జన్నిగట్టు=జందెమును వేసికొనువాఁడు, తెలిదమ్మిగద్దియఁ గొలువుండు రాయండు = శ్వేతపద్మసింహాసనమున గూర్చుండి కొలువుదీర్చు ప్రభువు, నిక్కపు జగమేలు నేర్పుకాఁడు = సత్యలోకమును బాలించు చతురుఁడు, కడుపు బంగారు బొక్కసము జేసిన మేటి=గర్భమును బంగారముంచు కోశాగారముగా జేసిన సమర్థుఁడు, పోరోగిరముతిండిపోతుతండ్రి= కలహభోజనుఁడగు నారదునితండ్రి, నలువ=నాలుగువదనములు గలవాఁడు, తమ్మిచూలి=(నారాయణునినాభి) కమలమునఁబుట్టినవాఁడు, నలుమొగంబులవేల్పు=చతుర్ముఖుడైన దేవుడు, వేల్పుపెద్ద=దేవతలకు బెద్దవాఁడు, పలుకువెలఁదిమగఁడు=వాగ్దేవిభర్త, తాత=పితామహుఁడు, బమ్మ=బ్రహ్మ, (అనన్=అనఁగా), విధాతనామములు=బ్రహ్మదేవునిపేర్లు, (16) ఒప్పున్ = వెలయును,

అఘవినాశ=పాపములను నాశముసేయువాఁడా! ఈశ = ఈశ్వరా! అభ్రకేశ=ఆకాశమే చూడముగా గలవాఁడా! Brahma

తే॥ గట్లరాయనిపట్టి, ముక్కంటివెలఁది,
యేనుగులదంటత త్తడి నెక్కుదంట,
సామి సామేనిఁజేకొన్నచాన, జగము
తల్లి, యన గౌరి పేళ్ళొప్పు (ధర నుమేశ.) 9

టీ॥ గట్లరాయనిపట్టి = గట్టులరాజగు హిమవంతుని కూఁతురు, ముక్కంటి వెలఁది=త్రిలోచనుని సాధ్వి, ఏనుఁగులగొంగ తత్తడి నెక్కుదంట=గజవిరోధియగు సింగమునెక్కు ధీరురాలు, సామి సామేనిఁ జేకొన్న చాన=భర్తయొక్క సగము శరీరమున నివసించు కామిని, జగముతల్లి = లోకమాత అను యీ ౫ ను పార్వతీదేవి పేరులు. Parvathi

తే॥ లచ్చి, కలుములజవరాలు, పచ్చవిల్తు
తల్లి, కటివేల్పునిల్లాలు, తల్లితల్లి
కడలికూఁతురు, సిరి, లిబ్బిపడఁతి, తమ్మి
యింటిగరి, తన శ్రీయొప్పు (మృగధరాంక!) 10

టీ॥ మృగధరాంక=ఈశ్వరా! లచ్చి=లక్ష్మి, కలుములజవరాలు=సంపదలుగల యువతి, పచ్చవిల్తుని తల్లి=పచ్చనివిల్లుగల మన్మథుని తల్లి, కటివేల్పు నిల్లాలు=శ్రీమన్నారాయణుని భార్య, తల్లితల్లి=తండ్రియైన సముద్రుని సాధ్వియగు గంగకుఁ దల్లి, కడలికూఁతురు=సముద్రునిపట్టి, సిరి=శ్రీ, లిబ్బిపడఁతి=నిధులకు అధిదేవతయైన సతి, తమ్మియింటిగరిత = పద్మనిలయవాసిని అను నీ ౯ యు లక్ష్మికిఁ బేరులు. Lakshmi

క॥ తలవాఁకిటను మెలంగెడు
పొలఁతుక, పలుకులవెలంది, పొత్తము ముత్తో,
నలువపడఁతి, కలుములపై
దలి కోడ, లనంగఁ బరగు (ధర) వాణి (శివా!) 11

టీ॥ తలవాఁకిటను మెలంగెడు పొలఁతుక = నోటియందు వసించెడు సుదతి, పలుకులవెలంది=వాక్స్వరూపిణి, పొత్తము ముత్తో=పుస్తకములయందలి ముత్తైదువ, నలువపడతి = బ్రహ్మ సాధ్వి, కలుములపైదలికోడలు=శ్రీదేవి కోడలు, ఈ ౫ ను సరస్వతికిఁ బేళ్ళు.

శివా!=ఈశ్వరా! అని కృతిపతికి సంబోధనము

Saraswathi

సీ॥ ఇద్దఱుతల్లుల ముద్దుబిడ్డఁడు, పని
చెఱుపులదొర, చేటచెవులవేల్పు,
వంకరతొండంబు వాఁ, డేనుఁగుమొగంబు
దేవర, పాపజందెములమేటి,
మ్రొక్కువారల పనుల్ చక్కఁజేసెడు సామి,
గఱికపూజల మెచ్చు గబ్బివేల్పు,
ముక్కంటిపండుల మెక్కెడి తిండీఁడు,
ముక్కంటిగారాబు ముద్దుపట్టి,
ఆ॥ పెద్దకడుపువేల్పు, పిళ్ళారి, కుడుముల
తిండికాఁడు, కొక్కుతేజిరౌతు,
గుజ్జువేలు, పొంటికొమ్ముదేవర, వెన
కయ్యయనఁ వినాయకాఖ్య (లీశ!) 12

టీ॥ ఈశా!=ఈశ్వరా! ఇద్దఱుతల్లులముద్దుబిడ్డఁడు= గంగా పార్వతీదేవు లను నిద్దఱు తల్లులకు ప్రేముడికుమారుఁడు, పని చెఱుపులదొర = కార్యములకు విఘ్నముచేయు దైవము, చేట చెవుల వేల్పు=చేటలవలె వెడల్పయిన చెవులుగల దేవుఁడు, వంకరతొండంబువాఁడు=వంకరయైన తొండము గలవాఁడు, ఏనుఁగు మొగంబు దేవర=గజాననముగల దేవత, పాఁపజందెముల మేటి=పాములనుజన్నిదములుగాఁదాల్చుదిట్టరి, మ్రొక్కువారల పనుల్ చక్కఁజేసెడు సామి=తన్ను భజించువారి కార్యంబులను నిర్విఘ్నంబుగాఁ గొనసాగించెడుదొర; గఱికపూజల మెచ్చుగబ్బివేల్పు=గఱికతో పూజించినచో సంతసించు పెద్దదేవుఁడు, ముక్కంటిపండుల మెక్కెడు తిండీడు=నారికేళఫలముల నారగించు వేలుపు; ముక్కంటి గారాబుముద్దుపట్టి = త్రిలోచనుని ప్రియకుమారుఁడు; పెద్దకడుపువేల్పు=లంబోదరుఁడైన దేవుఁడు; పిళ్ళారి=కుడుముల తిండికాఁడు, కొక్కుతేజిరౌతు= ఎలుకవాహనంబుపైఁదిరుగాడుయోధుఁడు, గుజ్జువేలుపు=పొట్టిదేవుఁడు, ఒంటికొమ్ముదేవర=ఏకదంతంబుగలసామి, వెనకయ్య; యీ ౧౭ ను వినాయకుని పేర్లు. Vinayaka

సీ॥ పెనుపాఁపకవణంబు దిను వారువము రౌతు,
గట్టులయెకిమీని పట్టిపట్టి,
తెల్లుచూ, లార్గురుతల్లులకొమరుండు,
గాడుపుసంగడికాని కొడుకు,
పుంజుదాలుపు, వేలుపులతేని దళవాయి,
జంటమువ్మొములదంట వేల్పు,

కొంచగుబ్బలి ప్రక్కలించిన బలుదిట్ట,
రెండాఱు చేతుల దండిమగఁడు,
గీ॥ వేలుపులమూఁక పేరిటి వెలఁదిమగఁడు,
వేల్పుగమికాఁడు, వెనకయ్య వెనుకవాఁడు,
కొమరుసామి, మన సేనాని కొమరు మిగులు
విగతభవపాశ ! కాశీనివేశ ! ఈశ ! 13

టీ॥ పెనుపాఁపకవబంబుఁ దిను వారువము రౌతు = పెద్దవైన పాముల నాహారంబుగా మెక్కు (నెమ్మియు) వాహనంబు నెక్కుజోదు, గట్టుల ఱేకిమీని పట్టిపట్టి=గట్టులరాజగు హిమవంతుని కూఁతురైన పార్వతికిఁ బుత్రుఁడు, ఱల్లుచూలు=ఱల్లున జనించినవాఁడు; ఆఱుగురు తల్లుల కొమరుండు=ఆఱైన కృత్తికలకు గుమారుఁడు, గాడుపుసంగడికానికొడుకు = గాలికిఁ జెలికాఁడైన యగ్నికిఁ గుమారుఁడు, పుంజుతాలుపు=కోడిపుంజును ధ్వజము నందు దాల్చినవాఁడు, వేలుపులజెని దళవాయి = సురేంద్రుని సేనాధిపతి; జంటమువ్మొములపంటవేల్పు = ఆఱుమొగములు గల మేటిదేవుఁడు, కొంచగుబ్బలిప్రక్కలించినబలుదిట్ట=క్రౌంచాచలమును బగులగొట్టినధీరుఁడు, రెండాఱుచేతులదండిమగఁడు=పండ్రెండు చేతులుగల వీరపురుషుఁడు. వేలుపులమూఁకపేరిటి వెలఁది మగఁడు=దేవసేన యను పడంతికి భర్త; వేలుపు గమికాఁడు=దేవతాసేనానాయకుఁడు; వెనకయ్య వెనుకవాఁడు=విఘ్నేశ్వరుని యనుజుఁడు; కొమరుసామి=కుమారస్వామి; ఈ ౧౩ ను కుమారస్వామికిఁ బేళ్ళు. Subrahmanya

సీ॥ అలరువిల్తుండు, కన్నులవిల్తుఁడును, గమ్మ
విలుకాఁడు, చక్కెర వింటివాఁడు,

చెఱకువిల్కాఁడు, కెంజిగురులవిల్తుఁడు,
వెడవిల్తుఁడును, బచ్చవిల్తుఁ, డించు
విల్లుదాలుపు, తుంటవిలుకాఁడు, తియ్యవి
ల్కాఁడును, జమిలిముక్కాలినారి
విలుకాఁడు, చౌవంచములుకులుగలదంట,
రాచిల్కనెక్కెడు రాయరౌతు,

తే॥ మీను మొసలి సిడంబులమేటి, చంద
మామ యల్లుఁడు, వలరాజు, మరుఁడు, లచ్చి
కొమరుఁ, డను పేళ్ళ నొప్పుతు గుసుమధన్వ,
(విగతభవపాశ! కాశీనివేశ! యీశ!) 14

టీ॥ విగతభవపాశ = పోఁగొట్టబడిన సంసారబంధముగల వాఁడా! కాశీనివేశ! ఈశా! అలరువిల్తుండు = పూవులు విల్లుగా గలవాఁడు, కన్నులవిల్తుండు = కనుపులు విల్లుగా గలవాఁడు, కమ్మవిలుకాఁడు=తియ్యని విల్లుగలవాఁడు, చక్కెరవింటివాఁడు= శర్కర నొసంగు విల్లుగలవాఁడు, చెఱకువిలుకాఁడు= చెఱకుగడ ధనుస్సుగాగలవాఁడు, కెంజిగురులవిల్తుఁడు=ఎఱ్ఱనిచిగుళ్లువిల్లుగా గలవాఁడు. (కెంపు + చిగురు) "ప్రాఁతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబులకెల్లలోపంబు బహుళంబుగానగు." వెడవిల్తుఁడు=చులకని విల్లుగలవాఁడు; పచ్చవిల్తుఁడు=పచ్చని ధనుస్సుగలవాఁడు, ఇంచువిల్లుదాలుపు=చెఱకును ధనుస్సుగాధరించినవాఁడు,తుంట విలుకాఁడు=చెఱకుతుంట విల్లుగాగలవాఁడు, తియ్యవిల్కాఁడు= తియ్యని విల్లుగలవాఁడు, జమిలిముక్కాలినారి విలుకాఁడు= షట్పదముల అల్లెత్రాఁడుగల ధనుస్సుగలవాఁడు; చౌవంచములు కులుగలదంట = పంచబాణములుగల జోదు; రాచిల్కనెక్కెడు

రాయంచతేజి = రాజహంసయను వాహనముపై నెక్కు రాజైన జోదు, మీనుమొసలిటెక్కెంపుజోదులమేటి = చేప, మొసలి ధ్వజములుగాగల విల్తుడు, చందమామమేనల్లుడు=చంద్రుని మేనల్లుడు; వలరాజు= వలపులరేడు; మరుడు=మరులుగొల్పువాడు; లచ్చికొమరుడు= లక్ష్మీదేవి సుతుడు అను ఈ పేర్లతో కుసుమధన్వి=మన్మథుఁడు; ఒప్పుచు-వెలయుచున్నాఁడు. Manmadha

సీ॥ చలువలఱేఁడు, వెన్నెలఱేఁడు, రేఱేఁడు,
జాబిల్లి, రేవెల్గు, చందమామ,
తమ్ములపగవాఁడు, కమ్మవిల్తునిమామ,
కలువలఱేఁడు, పాల్కడలిపట్టి,
జక్కవకవవిప్పు, ముక్కంటి తలపువ్వు,
చుక్కలదొర, ప్రొద్దుజోడుకోడె,
తపసికన్పాప, బిత్తఱిజింకతాలుపు,
కలువేల్పు డాకన్ను, కడలివెన్న,
తే॥ పంటపైరుల యెకిమీఁడు, జంటదంట
చొకములపాళ్ళ తెలిముద్ద, చలివెలుంగు,
వేలుపులబువ్వ, చీఁకటివేరువిత్తు,
నెల; యనఁగఁ జంద్రు పేళ్ళొప్పు (నీలకంఠ!) 15

టీ॥ నీలకంఠా!=నల్లనైన కంఠముగల ఈశ్వరా! చలువలఱేఁడు=చల్లదనమున కధీశ్వరుఁడు. వెన్నెలఱేఁడు=వెన్నెల కధీశ్వరుఁడు. రేఱేఁడు=రాత్రి కధిపతి; జాబిల్లి=జానైన బింబముగలవాఁడు; రేవెల్గు=రాత్రియందువెలుఁగునిచ్చువాఁడు, చందమామ= చందమసుఁడు, తమ్ములపగవాఁడు=తామరలకు శత్రువు, కమ్మ

విల్తుని మామ=మన్మథునకు మేనమామ; కలువలఱేఁడు = కలువలకువిభుఁడు; పాల్కడలిపట్టి=క్షీరసముద్రమునఁబుట్టినవాఁడు; జక్కవకవవిప్పు=చక్రవాకములకువియోగకారకుఁడు; ముక్కంటితలపువ్వు=త్రినేత్రునితలయందుండు పుష్పము, చుక్కలదొర=నక్షత్రములకువిభుఁడు; ప్రొద్దుజోడుకోడె=సూర్యుని సహచరుఁడు; తపసి కన్పాప = అత్రిమునీశ్వరుని నేత్రమునఁ బుట్టిన పాపఁడు, బిత్తరిజింకతాలుపు = అందమైన మృగమును ధరించినవాఁడు కఱివేల్పుడాకన్ను = వెన్నుని యెడమకన్నయినవాఁడు; కడలివెన్న=క్షీరసముద్రమథనమున వెన్నవలెఁ దెల్లగాఁ బుట్టినవాఁడు, పంటపైరుల యెకిమీఁడు = పంటలకు సస్యములకు అధిదేవత; జంటదంటచౌకములపాళ్ళ తెలిముద్ద= (2 × 2 × 4=16) పదియాఱు కళలుగల తెల్లనిబింబము; చలివెలుంగు=చల్లనివెలుఁగుగలవాఁడు; వేలుపులబువ్వ = దేవతల కాహారము; చీకటివేరువిత్తు=తమము నడంచువాఁడు; నెల; అనఁగ=అను నీ ౨౪ ను, చంద్రుని పేళ్లు=చందురుని నామములుగా; ఒప్పుఁ=వెలయును.

Moon

సీ॥ వెన్నునివలకన్ను, వేఁడివేలుపుప్రొద్దు,
తొవలరాయిడికాఁడు పవలుసేయు
వేలుపు, పచ్చగుఱ్ఱాల వజీరుండు,
వేఁడివెలుంగు, రేవెల్గుజోడు,
జంటాఱుమేనులసామి, చీఁకటిగొంగ,
యెఱ్ఱనివేలుపు, నివముసూఁడు,
చదలుమానికము ప్రాఁజదువులపెట్టియ.
యేడుగుఱ్ఱముల తేరెక్కుజోదు,

మువ్వేలుపులయిక్క, మ్రొక్కులదేవర,
 గాములఱేఁడు, జక్కవలఱేఁడు,
వేచేతులఱేఁడు, వెలుఁగుల యెకిమీఁడు,
 వేవులసాకిరి, బాయమగఁడు,
తే॥ పెంటితెరువరి, తమ్మివాల్గంటిమగఁడు,
పోరసీగ్రెడు మొనగాండ్రుపోవుదారి,
జగముచుట్టంబు, జమునయ్య, జగముకన్ను,
నాఁగ, సూర్యుని పేళ్లొప్పు (నాగభూష!) 16

టీ॥ నాగభూషా! = సర్పము లలంకారముగాఁగలఈశ్వరా! వెన్నుని వలకన్ను=విష్ణువు కుడికన్ను; వేఁడివేలుపు=వేడిమిగల దేవుఁడు, ప్రొద్దు; తొవలరాయిడికాఁడు=కలువలకువిరోధి; పవలు సేయు వేలుపు=దినకరుఁడగు దేవుఁడు; పచ్చగుఱ్ఱాల వజీరుండు= పచ్చరంగుగల యశ్వముల నెక్కెడు జోదు, వేఁడివెలుంగు= వెచ్చనైన వెలుఁగునిచ్చువాఁడు, రేవెల్గుజోడు=చంద్రునకు జత గాఁడు, జంటాఱుమేనులసామి=పన్నెండుశరీరములుగలవిభుఁడు; చీఁకటిగొంగ=తమమునకు శత్రువు, యెఱ్ఱనివేలుపు=ఎఱ్ఱనిరంగు గల దేవుఁడు; ఇవముసూఁడు = హిమమును హరించువాఁడు, చదలుమానికము=నభమునకు మణివంటివాఁడు, పాఁజదువుల పెట్టియ=వేదములపేటిక; ఏడుగుఱ్ఱముల తేరెక్కుజోదు=ఏడు గుఱ్ఱములచే నీడ్వఁబడురథమునెక్కు యోధుఁడు, మువ్వేలుపుల యిక్క = బ్రహ్మవిష్ణుమహేశ్వరులను ముగ్గురు దేవతలకు నిల యము, మ్రొక్కుల దేవర = నమస్కారప్రియుఁడైన దేవుఁడు. గాములఱేఁడు=గ్రహముల రాజు, జక్కవలఱేఁడు=చక్రవాకపక్షు లకు నేలిక; వేయునేతులఱేఁడు = వేయి కరములుగలరాజు,

వెలుఁగుల యెకిమీఁడు=వెలుతురున కధీశ్వరుఁడు, చైవుల సాకిరి= కర్మసాక్షి; చాయమగఁడు = ఛాయాదేవికి భర్త; మింటితెరువరి= అకసమున సంచరించు బాటసారి; తమ్మివాల్గంటిమగఁడు = పద్మినీ ప్రియుఁడు; పోరనీల్గిన మొనగాండ్రుపోవుదారి=పోరునఁ జచ్చిన వీరులు (స్వర్గమునకు) బోవు మార్గము. (యుద్ధనిహతులు సూర్యమండలమును ఛేదించుకొని స్వర్గమునకుఁ బోవుదురని ప్రసిద్ధి.); జగముచుట్టము=లోకబాంధవుఁడు, జమునయ్య = యమునితండ్రి; జగముకన్ను = లోకమునకు చక్షువు; నాఁగ= అను నీ అర యును; సూర్యుని పేళ్ళు=సూర్యుని నామములై యొప్పును=వెలయును. Sun

సీ॥ చట్టుపల్ దెగగట్టఁ గొట్టెడి జెట్టి, నూ
అంచులవాలు చేమించుజోదు,
దుగబొట్ల పిఱిఁది యైదుకనుంగవలవేల్పు,
పాఱుతపసియింటి పంచకోడి,
యొడలిచూపొడయఁ, డెక్కుడు మొగుల్ గల...,
నిక్కువీనులజక్కి నెక్కురౌతు,
తెల్లయేనుఁగునెక్కి తిరిగెడుదొర, తూర్పు
మాగాని యేలెడు మన్నియకాఁడు,

తే॥ జలిమిచౌవంచపదులు జన్నములు సేసి
నట్టి వేలుపు, సోమాసి పెట్టుఁ జెట్టు,
పొట్టితమ్ముఁడు గలిన యట్టివేల్పు,
నాఁగ నిందుని పేళ్ళొప్పు (నాగభూష!) 17

టీ॥ నాగభూషా ! = ఈశ్వరా ! చట్టుపల్ దెగఁగట్టఁగొట్టెడు జెట్టి=కొండల తెక్కలను ఛేదించినవీరుఁడు; నూఅంచులవాలుచే

మించుపోటు=నూఱంచులుగల వజ్రాయుధమును గేలధరించిన యోధుఁడు; మగబొట్టి పెక్కుఁడి యైదు కనుంగవలవేల్పు=రెండు నన్నూర్ల వెనుక నైదు (500) కనుగవలుగలవేల్పుఁడు, (వేయి కనుల సామి); పాఱుతపసియింటి పంచకోడి = బ్రహ్మర్షియగు గౌతముని యింటి పంచను కోడిరూపుఁజెందిన వేలుపు, ఒడలి చూపుపడయుడు = శరీరమెల్లఁ గనులుగల యెకిమీఁడు, ఎక్కుడు మొగులెగలప్రోడ=మేఘములే వాహనముగాగల నేర్పరి; నిక్కు వీనులజక్కి నెక్కురౌతు=నిక్కియుండు చెవులుగల వాహనమును ఉచ్చైశ్శ్రవమను గుఱ్ఱమునెక్కెడు యోధుఁడు; తెల్లయేనుఁగు నెక్కి తిరిగెడు దొర=ఐరావతముపై నెక్కి సంచరించెడు జోదు; తూర్పు మాగానియేలెడు మనియకాఁడు = తూర్పురాజ్యమును బాలించెడు విభుఁడు; జమిలిచౌవంచపదులు జన్నము చేసినట్టి వేలుపు=రెండు అయిదులపదులు (నూఱు) యాగములు చేసిన దేవుఁడు; సోమాసిపెట్టుఁజెట్టు=సోమయాజిపాలిటి కల్పవృక్షము; పొట్టితమ్ముఁడుగల్గినయట్టి వేల్పు=వామనుఁడైన తమ్ముఁడుగల్గిన దేవుఁడు, నాఁగ=అనఁగా నీ ౧౭ ను; ఇంద్రుని పేళ్ళు=ఇంద్రుని నామములుఁగా; ఒప్పుఁ=వెలయును. Lord Indra

ఆ॥ నీరుపాప, గాలినెచ్చెలి, యన్నింటి
తిండికాఁడు, కప్పుఁదెరువుజాడ,
యంటరానివేల్పు, జంటమోములసామి,
యగ్గి, యనఁగ నొప్పు ననలుఁ డీశ! 18

టీ॥ నీరుపాప = జలమునఁ బుట్టిన బుడుతఁడు; గాలి నెచ్చెలి=వాయుసఖుఁడు; అన్నింటితింటికాఁడు=సర్వభక్షకుఁడు; కప్పుదెరువుజాడ = నల్లనిమార్గముగలవాఁడు; అంటరానివేల్పు=

ముట్టుటకు వీలులేనిదేవుఁడు; జంటమోములసామి = రెండుమొగములుగల సామి, అగ్గి; అనఁగ౯=అను నీ ౭ పేరులచేతను; అనలుఁడు=అగ్నిదేవుడు; ఒప్పును=వెలయును. ఈశా! Fire God

తే॥ జమున సైదోడు; పెతరులసామి, జముఁడు,
పొద్దుకొమరుఁడు, గుదెతాల్పు, పోతుజక్కి-
నెక్కి యాడెడు బలురౌతు, దక్కినంపు
సామి, యన నంతకుం డొప్పు (శ్రీమహేశ!) 19

టీ॥ శ్రీమహేశా! జమునసైదోఁడు=యమునానదికిఁ దోడఁబుట్టినవాఁడు; పెతరులసామి=పితృదేవతలకుఁ బ్రభువు, పొద్దుకొమరుఁడు=సూర్యునికుమారుఁడు, గుదెతాల్పు=గదాధారి; పోతుజక్కినెక్కియాడెడుబలురౌతు=దున్నపోతువాహనమునెక్కి దిరుగాడు యోధవరుఁడు; దక్కినంపుసామి=దక్షిణదిశకు విభుఁడు, అన౯=అనఁగా నీ ౭ పేర్లచేతను, అంతకుండు = యముఁడు, ఒప్పు౯=వెలయును. Yama

ఆ॥ మూలఱేఁడు, సోఁకుమూఁకలఱేఁడు రే
ద్రిమ్మరీఁడు, పొలసుదిండిపోతు,
రక్కసుండు, నల్లద్రావువా, డనఁగను
నిర్బతి పేళ్ల నెల్లు నీలకంఠ! 20

టీ॥ నీలకంఠ!=నల్లనికంఠముగల ఈశ్వరా! మూలఱేఁడు=నైర్బతిమూలకధిపతి, సోఁకుమూఁకలఱేఁడు = రాక్షససమూహములకుఁ బ్రభువు; రేద్రిమ్మరీఁడు = రాత్రులయందు సంచరించువాఁడు; పొలసుతిండిపోతు = మాంసమును దినువాఁడు;

రక్కసుండు=రాక్షసుండు; నెత్తుద్రావువాఁడు=రక్తమును ద్రావువాఁడు; అనఁగ నీ ౩ ను నిరృతిపేళ్ళు సెల్లు = నైరృతి నామములుగా వెలయును. Nirvuthi

ఆ॥ మేటినీరుచూలి మెయితాలుపులసామి,
వల్లెత్రాఁడు దాల్పు, నీళ్ళరాయఁ,
డేటిబోఁటిమగల యెకిమీఁడు, పడమటి
దొర యనంగ నొప్పు వరుణుఁ (డీశ!) 21

టీ॥ ఈశా! మేటినీరుచూలిమెయితాలుపులసామి=సముద్రమునఁ బుట్టిన జలచరములకు విభుఁడు; వల్లెత్రాఁడు తాల్పు=పాశమునాయుధముగాఁ ధరించినవాఁడు, నీళ్ళరాయఁడు=జలమున కధిదేవత; ఏటిబోటిమగల యెకిమీఁడు=వాహినీపతుల పెనిమిటియగు సంద్రములకు నధిదేవత; పడమటిదొర=పశ్చిమ దిక్పాలకుఁడు, అనఁగ=అను నీ ౫ ను; వరుణుఁడొప్పు=వరుణుని నామములు. Varuna

సీ॥ వడిగలజింకతత్తడి నెక్కు నెఱరౌతు,
మేటిపాములమేఁత, నీటితాత,
యొడలితాల్పులపిండు కుసురగు బలియుండు,
సోఁకుదయ్యము, మింటిచూలిగాలి,
కరువలి, తెమ్మెర, గాడ్పు, పయ్యెర, యొంటి
ప్రాఁకుల పెనుముప్పు, మబ్బువిప్పు,
సురఁటివీవులఁ బుట్టు సుడిగొట్టు, చలినట్టు
టెక్కువారల పెనుబాద, యూఁద,
తే॥ అబ్బురపుఁ దియ్యవిలుకాని నిబ్బరంపు
దెబ్బపోరుల నఱయిక ప్రిబ్బుబోంట్ల

గబ్బిగుబ్బల చెమటల యుబ్బడంచు
గబ్బి నాఁ జను మారుతాఖ్యలు (మహేశ!) 22

టీ॥ మహేశా! వడిగల జింక తత్తడినెక్కు నెఱరౌతు=వేగపుగమనముగల లేడివాహనమునెక్కు దిట్టరి; మేటిపాముల మేఁత=మహాసర్పములకు నాహారమైనవాఁడు; నీటితాత=జలములకుఁ దాత; ఒడలితాల్పులపిండుకునురగు బలియుండు=దేహధారుల సమూహమునకుఁ బ్రాణమైన బలవంతుఁడు, సోఁకుదయ్యము=స్పర్శమాత్రవ్యాపారియగు దైవము, మింటిచూలి=ఆకసమునఁ బుట్టువాఁడు, గాలి, కరువలి, తెమ్మెర, గాడ్పు, పయ్యర, ఒంటిమ్రాకుల పెనుముప్పు=ఒంటరిగా ససహాయముగా నున్న చెట్లకు ఎక్కువ హానిచేయువాఁడు; మబ్బువిప్పు = మబ్బులను చెల్లాచెదరుచేయువాఁడు; సురటివీవులఁబుట్టు=చామరము వీచుటచే జనించువాఁడు; సుడిగొట్టు=గుండ్రముగా వీచువాఁడు. చలినట్టు=చలికి స్థానమైనది, బక్కవారల పెనుబాధ=బక్కచిక్కినవారి నధికముగ బాధించువాఁడు; ఈద; అబ్బురపు దియ్యవిలుకాని నిబ్బరంపు దెబ్బపోరుల నలయిక ప్రబ్బుబోంట్ల గబ్బిగుబ్బలచెమటల యుబ్బడంచు గబ్బి=అచ్చెరువు గలిగించు మరుని బాణప్రఘాతములవలన నాయాసమునొందిన జవ్వనుల గొప్పకుచములమీఁది పెద్దచెమటలను బోఁగొట్టుటయందునేర్పరి; వినుచూలి=ఆకసమునఁబుట్టినదేవర, గొట్టు; అనంగ=అను నీ౨౧ యును మారుతాఖ్యలు=వాయువునకుఁ బేర్లై, చను=ఒప్పును.

Air.

క॥ మరుదాఖ్య లొప్పుచుండును
ధర విను చూలి, యన సోఁకుదయ్య, మనం బ

య్యెర, యన గొట్టన నీఁ, దనఁ
గడవలి, యనఁ దెమ్మెరనఁగఁ, గాలి, యనంగన్.

టీ॥ పినుచూలి, సోఁకుందయ్యము, బయ్యెర; గొట్టు, ఈఁదు, కడవలి; తెమ్మెర, గాలి, యనునవి మరుత్తునకు నామములు. పై సీసమునఁ జెప్పఁబడిన పదములు ఈ కందమునఁ గొన్ని పునరుక్తములైనవి. Wind

క॥ ముక్కంటి యనుఁగుఁజెలి, కడ
చక్కెలిక, చాగకాఁడు, జక్కులదొర, బల్
రొక్క మెకిమీఁడు, మానిసి
నెక్కెడువాఁ, డనఁగఁ జను ధనేశుం (డభవా!) 24

టీ॥ ముక్కంటియనుఁగుచెలి = ఈశ్వరునకుఁ బ్రియమిత్రుఁడు, కడచక్కెలిక = ఉత్తర దిక్కునకు ఱేఁడు, చాగకాఁడు=ధనదాత, జక్కులదొర=యక్షులకుఁ బ్రభువు, బల్ రొక్కమెకిమీఁడు=ఎక్కువ ధనమునకు రాజు, మానిసినెక్కువాఁడు= నరవాహనము నధిరోహించువాఁడు, అను నీపేరులచే ధనేశుఁడు= కుబేరుఁడు; చనున్=ఒప్పును. అభవా ! = పాపరహితుఁడవైన సర్వేశ్వరా! Knbera

క॥ విడిముడిగల వేలుపుచెలి,
జడముడిజంగంబు, గడదెసం గాపరి యా
యొడయండు, పాఁపతొడవుల
నిడియెడి వేల్పు, నఁగ నొప్పు నీశానుఁ డిలన్. 25

టీ॥ విడిముడిగలవేలుపుచెలి = ధనముగల వేలుపునకుఁ (గుబేరునకు) మిత్రుఁడు; జడముడిజంగంబు=జడలను దాల్చిన

బిచ్చగాఁడు, కడదెసఁగాపరియౌ యొడయండు = తుది దిక్కగు నీశాన్య దిక్కు నేలెడి యెకిమీఁడు, పాఁపతొడవుల నిడియెడు వేలుపు=నాగములను భూషణములుగాఁ గలిగిన దైవము; ఈ ౪ ను, ఈశానుని పేర్లు.

క॥ దేవాలయాహ్వాయంబులు
కోవెల, యన దేవళంబు, గుడి, నా వెలయున్
దేవ, ళ్ళన, జేజే, లనఁ
గా వేలుపు, లనఁగ వెలయుఁ గ్రతుభుగభిఖ్యల్. 26

టీ॥ కోవెల, దేవళము, గుడి, ఇవి దేవాలయమునకుఁ బేర్లు. దేవళ్లు; జేజేలు; వేలుపులు, యివి (క్రతుభుక్కులకు) దేవతలకుఁ బేరులు. Devas

ఆ॥ క్షితినిఁ బేళ్ల దనరు సిరిదంపుఁబెద్ద, బల్
పాఁపఱేఁడు వెన్నుపాను, పనఁగఁ
బుడమితాలు, పనఁగఁ దడవుల నిడుపండు,
చిలువఱేఁ, డనంగ శేషనకును. 27

టీ॥ సిరిదంపుఁబెద్ద=కుబుసముగల పెద్ద. బల్పాఁపఱేఁడు= మహాసర్పములలోపెద్దది. వెన్నుపానుపు=విష్ణునితల్పము. పుడమి తాలుపు=భూమినివహించువాఁడు; తడవుల నిడుపండు=చిరంజీవి; చిలువఱేఁడు=పాములకు రాజు; ఈ ౬ను శేషునకుఁ బేర్లు.
Adisesha

క॥ మరునయ్యతేజి, పులుఁగుల
దొర, పాములవేటకాఁడు, తూరుపునాఁడేఁడ్

దొరబువ్వగొన్న లావరి,
గరుత్మంతుఁ, డనఁ జొప్పు గరుడుం డభవా! 28

టీ॥ అభవా! = పాపరహితుఁడవైన ఈశ్వరా! మరునయ్యతేజి = మదనజనకుఁడగు విష్ణుని వాహనము, పులుఁగులదొర= విహంగేశ్వరుఁడు, పాములవేఁటకాఁడు=పాములనువధించువాఁడు తూపువాఁడేల్దొరబువ్వగొన్నలావరి = ఇంద్రునాహారమగు నమృతమును తెచ్చిన సత్త్వశాలి. గరుత్మంతుఁడు, ఈ ౫ను గరుత్మంతునకు నామములు.

Garuda

ఆ. నల్లవలువతాల్పు, తెల్లనిమైదంట,
వెన్నదొంగయన్న, వెఱ్ఱినీళ్ళ
మేలువాఁడు, దుక్కివాలుదాలుపు, తాటి
పడగవాఁడనంగ, బలుఁడు రుద్ర! 29

టీ॥ నల్లవలువతాల్పు=నల్లని వస్త్రములను ధరించువాఁడు, తెల్లనిమైదంట = తెల్లని శరీరముగల జోదు, వెన్నదొంగయన్న = శ్రీకృష్ణుని అన్న, వెఱ్ఱినీళ్ళమేలువాఁడు=కల్లు ద్రావ నిచ్చగించువాఁడు, దుక్కివాలుదాలుపు=నాఁగలి యాయుధముగాఁ బూనువాఁడు, తాటిపడగవాఁడు, ఈ ౬ ను బలరామునకు నామములు, రుద్రా! = ఈశ్వరా!

Balarama

క. వడముడి, యనఁగా గాడుపు
కొడు, కన నివి రెండుఁ బేళ్ళగున్ భీమునకుం;
బుడమిం గఱ్ఱి, యనం గ
వ్వడి, యన వివ్వచ్చుఁ, డనఁగ వాసవి (యీశా!)

టీ॥ ఈశా! వడముడి, గాడుపుకొడుకు, ఈరెండును భీముని పేర్లు. Bhima

కణ్ణి, కవ్వడి = రెండుచేతులతో బాణప్రయోగము చేయువాఁడు, (ఈ శబ్దము, ఆర్యవ్యవహారమగుటచే గ్రాహ్యము.) విచ్చుఁడు=భీభత్సుఁడు, ఇవి 3 ను అర్జునుని పేర్లు. Arjuna

తే॥ వేలుపులత్రోవ, యుప్పరవీధి, యాక
సంబు, విను, విన్ను, మిను, మిన్ను, చదలు, నింగి,
దివి, మొయిలుదారి, చుక్కలతెరువు, బయలు
గాడ్పుతం, డ్రిన నభ మొప్పు (గరళకంఠ!) 31

టీ॥ గరళకంఠ = విషము కంఠమునందుఁ గలవాఁడా! ఈశ్వరా! వేలుపులత్రోవ=దేవతల మార్గము, ఉప్పరవీధి=పై మార్గము, ఆకసము=ఆకాశము, విను, విన్ను, మిను, మిన్ను; చదలు, నింగి, దివి, మొయిలుదారి=మేఘమార్గము, చుక్కల తెరువు= నక్షత్రమార్గము, బయలుగాడ్పుతండ్రి=వాయుజనకము. ఈ ౧౪ ను ఆకాశమునకు నామములు. Sky

తే॥ వెలయు ధరణిఁ జతుర్దిశల్ నలుగడలన
నలరు దచ్చికడలన దిశాష్టకంబు;
నలరు నీరైదుకడలు నా దశదిశలును,
(మౌళిధృతగంగ యంగజ మదవిభంగ!) 32

టీ॥ మౌళిధృతగంగ = శిరస్సునందు గంగను ధరించినవాఁడా! యంగజమదవిభంగ=మన్మథునిమదమునడంచినవాఁడా! నలుగడలు(అన)=నాలుగుదిక్కులు, దచ్చికడలు(అన)=ఎనిమిది దిక్కులు ఈరైదుకడలు (అన) దశదిశలు, (బేర్లై) వెలయు= ఒప్పును. Cardinal Roits

ఆ॥ తాటిసికముపాని తల్లి, కూఁతురిబిడ్డ,
వెన్నునడుగుపాప, మిన్నువాఁక,
వేల్పుపేఱు, కడలివెలఁదుక, ముత్రోవ
దిమ్మరనఁగ నొప్పు దివిజగంగ. 33

టీ॥ తాటిసికముపానితల్లి=తాళధ్వజముగల భీష్మునితల్లి, కూఁతురిబిడ్డ=తన పుత్రికయగు లక్ష్మికి బిడ్డయైనది, వెన్నునడుగు పాప=విష్ణునిపాదమునందు పుట్టిన చిన్నిపట్టి; మిన్నువాఁక=గగన మండలమునఁ బ్రవహించునది, వేల్పుటేఱు=దేవతానది, కడలి వెలఁదుక=సాగరుని యంగన, ముత్రోవద్రిమ్మరి=మూఁడుమార్గ ములఁ బ్రవహించునది, త్రిపథ గామిని, ఈ ౭ ను దివిజ గంగా నదికిఁ బేరులు. The Ganges

తే॥ వేలుపులగౌరు, చౌదంతి, వెల్లయేనుఁ,
గనఁగ నైరావతంబున, కాఖ్యలమరు,
వేల్పుదొరతేజి, యనఁగను వెల్లగుఱ్ఱ,
మనఁగ నుచ్చైశ్శ్రవం బొప్పు (నంబికేశ!) 34

టీ॥ అంబికేశ! = ఈశ్వరా! వేలుపులగౌరు = దేవతల యేనుఁగు, చౌదంతి=నాలుగు దంతములుగలది; వెల్లయేనుఁగు= తెల్లని గజము, ఇవి 3 ను ఐరావతమునకు నామములు.

Airavatha Elepnant

వేల్పుదొరతేజి = ఇంద్రునివాహనమగు నశ్వము, వెల్ల గుఱ్ఱము=తెల్లని గుఱ్ఱము, ఈ ౨ ను ఉచ్చైశ్శ్రవమునకుఁ బేర్లు

Uchaisrava Horse

ఆ॥ పుడుకుదొడుకు, వేలుపులగిడ్డి, వెలిమొద
లనఁగఁ గామధేను వలరుచుండు;
కల్పకంబు దనరు వేల్పుఁజె, ట్టీవుల
మ్రాను, వెల్లమ్రాను, నా (నుమేశ!) 35

టీ॥ ఉమేశా! = ఈశ్వరా! పుడుకువొడుకు = కోరికల నొసంగునట్టి యావు; వేలుపులగిడ్డి=దేవతల యావు, వెలిమొదవు= తెల్లని యావు, ఈ మూఁడును కామధేనువునకుఁ బేర్లు.

Kamadhenu

వేల్పుజెట్టు = సురలతరువు, వెల్లమ్రాను = తెల్లనిచెట్టు, ఈవుల మ్రాను=కోరికల నొసంగెడి ద్రుమము, ఈ 3 ను, కల్ప వృక్షమునకుఁ బేర్లు. Kalpa Tree

ఆ॥ అవనిఁ గుడుసుకైదు వనఁగ, వేయంచుల
కైదు, వనఁగఁ జుట్టుఁగైదు, వనఁగ
బటువుఁగైదు, వనఁగఁ బరఁగు సుదర్శన
చక్రమునకుఁ బేళ్లు (చంద్రమౌళి!) 36

టీ॥ చంద్రమౌళి! = చంద్రుని శిరస్సునఁ ధరించిన యీశ్వరా! గుడుసుకైదువు=గుండ్రని యాయుధము, వేయంచుల కైదువు=వేయి మొనలుగల యాయుధము, చుట్టుఁగైదువు=వల యాకారముగల యాయుధము, బటువుగైదువు = గుండ్రమైన యాయుధము, ఈ ౪ ను, నారాయణుని యాయుధమగు సుద ర్శన చక్రమునకుఁ బేరులు.

The disc of Vishnu

ఆ॥ వలమురియనఁ, జుట్టువాలుజోడనఁ, గమ్మి
కొమ్మమగనిఁబూరగొమ్మనంగఁ,

దనరుఁ బాంచజన్యమునకు నభిఖ్యలు
(ధృతకురంగ! ధవళవృషతురంగ!) 37

టీ॥ ధృతకురంగ=ధరింపఁబడిన సారంగముగలవాఁడా! ధవళవృషతురంగ! = తెల్లని వృషభము వాహనముగాఁ గల వాఁడా! ఈశ్వరా! వలమురి=కుడిప్రక్కకుఁ దిరిగియుండునది, చుట్టువాలుజోడు = సుదర్శనచక్రమునకుఁ జోడుగా నుండునది; కల్మికొమ్మమగనిబూరగొమ్ము=శ్రీపతి పూరించు వాద్య విశేషము, ఈ మూఁడును పాంచజన్య మను శంఖమునకుఁ బేరులు.
The conch of Vishnu

తే॥ రిక్కలనఁ జుక్కలనఁగను, ఋక్షములకు
నాఖ్యలై యొప్పుఁ, దెఱఁగంటియన్ను లనఁగ,
నచ్చర లనంగ, వేలుపుమచ్చెకంటు
లనఁగ, సురకాంతలకు నాఖ్యలగు (గిరీశ!) 38

టీ॥ గిరీశ! = కైలాసపర్వతమున కధీశ్వరుఁడా! రిక్కలు, (ఋక్షశబ్దభవము) చుక్కలు; ఈ రెండును నక్షత్రముల పేర్లు.
Stars

తెఱగంటియన్నులు = (అనిమిషకాంతలు), అచ్చరలు= (అప్సరశబ్దభవము), మచ్చెకంటులు= (సురకాంతలు) ఈ మూఁడును అప్సరసల పేర్లు. The celestial Women

తే॥ పవలు, పగలనఁ, బేళ్ళొప్పు దివమునకును,
రాత్రి పేళ్ళొప్పు రే, రేయి, రాతిరనఁగ,
వెలయుచుండును రేయెండ, వెన్నెలనఁగఁ,
జంద్రికకును సమాఖ్యలు (చంద్రమౌళి!) 39

టీ॥ చంద్రమౌళీ! ఈశ్వరా! పవలు; పగలు; ఈ రెండును దినమునకు నామములు. Day

రే, రేయి, రాతిరి, ఈ 3 ను, రాత్రిపేళ్లు. Night

రేయెండ (రాతిరిగాయునెండ) వెన్నెల (తెల్లని చంద్రుఁడు గలది) ఈ రెండును చంద్రికకు పేళ్లు. Moonlight

క॥ మించులన, మెఱుపులనఁగను,
జంచలలకుఁ బేళ్ళు దనరు; జలధరములు రా
ణించుం బలుకంగ మొయి,
ళ్ళుంచు మొగు, ళ్ళుంచు, మబ్బులంచుఁ, భర్గా! 40

టీ॥ భర్గా! ఈశ్వరా! మించులు; మెఱుపులు, ఈ రెండును చంచలలకుఁ బేర్లు. Lightning

మొయిలు, మొగులు, మబ్బు, ఈ 3 ను, జలధరములకు= మేఘములకుఁ బేర్లు. Clouds

క॥ తొలిచదువులు, ప్రాఁజదువులు,
దొలిమినుకులు, ప్రామినుకులు,తొలిపలుకులు,ప్రాఁ
బలుకులు, పెనుమినుకులు, నా
వెలయుఁ శ్రుతులకును బేర్లు విశ్వాధిపతీ! 41

టీ॥ విశ్వాధిపతీ! = కాశీవిశ్వేశ్వరా! తొలిచదువులు; ప్రాఁజదువులు, తొలిమినుకులు, ప్రామినుకులు, తొలిపలుకులు, ప్రాఁబలుకులు (ఆదివాక్కులు) పెనుమినుకులు (విస్తృత వాక్కులు); ఈ యేడును శ్రుతులకు నామములు.

Vedas

క: ఇది దేవవర్గ, బీనిం
జదివిన, వ్రాసినను, వినిన, జనులకు నిత్యా
భ్యుదయంబు లొసఁగుచుండును
సదయత కాశీనివాసవాసుఁడు పేర్మిన్. 42

టీ॥ ఇది దేవవర్గు; దీనిని జదివినవారికిని, వ్రాసినవారికిని, వినినవారికిని, గాశీవిశ్వేశ్వరుఁడు దప్పక కరుణతో నభ్యుదయము లిచ్చుచుండును.

దే వ వ ర్గ

సమాప్తము.



# మానవవర్గు

—:O:—

Names of men and their belogings.

తె॥ పాఱుఁడనగఁ, బుడమివేల్పు, బాఁపఁ, డనఁగ
జన్నిగ, ట్టన విప్రుండు, జగతిఁ బరఁగు;
నొడయఁ, డేలిక, యెకిమీఁడు, పుడమిఱేఁడు,
ఱేఁడు, దొర, సామి, యననొప్పు నృపతిపేళ్ళు. 1

టీ॥ పాఱుఁడు, పుడమివేల్పు=మహీసురుఁడు, బాఁపఁడు; జన్నిగట్టు=జందియము దాల్చువాఁడు. ఈ ౪ను, బ్రాహ్మణుని పేర్లు. Brahmins

ఒడయఁడు, ఏలిక, ఎకిమీఁడు, పుడమిఱేఁడు=భూమీశ్వరుఁడు, ఱేఁడు, సామి, దొర, అను ని ౭ ను, క్షత్రియునకుఁబేర్లు. Kshatrias

సీ॥ కోమట్లు మూఁడవకొలమువాం, డ్రిన బేరు
లన, వైశ్యనామము, లనరుఁ గాఁపు
వాండ్రు, నా నాలవవాండ్రు, నా బలిజెవాం,
డ్రనఁ జను శూద్రసమాహ్వయములు;
వడుగు నా గోఁచిబాఁపఁడు, నాగ బ్రహ్మచా
రికిఁ బేళ్ళు నడచు ధరిత్రియందు,
నాలుబిడ్డలుగలయతఁ, డిలుఱేఁడు, గే,
స్తన నొప్పుఁ బేళ్ళు, గృహాధిపతికి,

ఆ॥ అడవిమనికిపట్టు, జడదారి, యన వన
వాసి యొప్పుఁ; నిల్లువాసితిరుగు,
బోడ, తపసి, కావిపుట్టగోచులసామి,
యన యతీంద్రుఁ, డలరు (నలికనేత్ర!) 2

టీ॥ అలికనేత్ర! = ఫాలలోచనా! కోమట్లు, మూఁడవ కొలమువాడు, శెట్టులు. ఈ మూఁడును వైశ్యునకు నామములు.
Vaisyas

కాఁపువాండ్రు, నాలతవాండ్రు, బలిజెవాండ్రు; ఈమూఁడును శూద్రునకుఁ బేర్లు. Sudras

వడుగు, గోచిపాతఁడు, ఈ రెండును బ్రహ్మచారికిఁ బేళ్ళు.
Bachelor

ఆలుబిడ్డలు గలయతఁడు=భార్య, పిల్లలుగలవాఁడు, ఇలు ఱేఁడు=గృహయజమానుఁడు, గేస్తు, ఈ ౩ ను, గృహస్థుని పేర్లు.
Head of the family

అడవి మనికిపట్టు=వనవాసి, జడదారి=జటాధారి, ఈ రెం డును వానప్రస్థుని పేర్లు. An anchorite

ఇల్లువాసితిరుగు, బోడ,తపసి,కావిపుట్టగోచులసామి=కావిరంగు గలగోపీనమును ధరించువాఁడు, ఈనాలుగును సన్యాసికిఁ బేర్లు.
Hermit

సీ॥ అమ్మ, నాఁ దల్లి, నా నవ్వ, నాఁ గన్నది,
యన మాతృకాఖ్యలౌ, నభ్రకేశ!
అబ్బ, నాయన, యయ్య, యనఁదండ్రి యన నప్ప,
యన జనకాఖ్యలౌ, నగనివేశ!

తోడఁబుట్టినఁగఁ బైఁదోడు, తోఁబుట్టన
సోదరాహ్వయములౌ నాదిదేవ!
భర్తృసహోదరు భార్యకుఁ దోడికో,
డలన, నేరా, లన నలరు నభవ!
తే॥ చెలియ, లనఁ జెల్లె, లనఁగను వెలయుచుండు
నాహ్వయములు కనిష్ఠకన్యకు గిరీశ,
జ్యేష్ఠకన్యకు నాఖ్యలై, క్షితిని వెలయు,
నప్ప, యన నక్క, యనఁగఁ జంద్రార్ధమకుట! 3

టీ॥ అభ్రకేశ! నగనివేశా! ఆదిదేవా! అభవా! గిరీశా! చంద్రార్ధమకుట! = ఓ విశ్వేశ్వరా! అమ్మ=అంబ, తల్లి, అవ్వ, కన్నది, ఈ ५ ను, మాతకుఁ బేర్లు.

Names of a mother

అబ్బ, నాయన, అయ్య, తండ్రి, అప్ప, ఈ ५ను; తండ్రికిఁ బేర్లు. Father

తోడఁబుట్టు, పైఁదోడు, తోఁబుట్టు, ఈమూఁడును సోదరుని పేర్లు. Brother

తోడికోడలు=తనజోడగు కోడలు; ఏరాలు=(ఎరవు + ఆలు) పెరవాని పెండ్లాము, ఈ రెండును దోడికోడలికిఁ బేర్లు.

Fellow-daughter-in-law

చెలియలు, చెల్లెలు=ఈ రెండును, కనిష్ఠ సోదరికిఁబేరులు.

Younger Sister

అప్ప, అక్క, ఈ రెండును జ్యేష్ఠసోదరికిఁ బేర్లు.

Elder Sister

సీ॥ ముగ్ధకుఁ బేళ్లగు, ముగుద, యనన్ ముద్ద
రాలు, నా గోల, నా బేల, యనఁగఁ.

గట్టివాయి. యనంగ గయ్యాళి, యనఝాఁగ,
యన దుష్టసతికి నాహ్వయములమరు;
ఐదువ, నాఁగ ముత్తైదువ, నా నయి
దువరాలు, నాఁ బుణ్యయువతి వెలయు;
మృతచిరంటికి నాఖ్యలెసఁగుఁ, బేరంటాలు
నాఁగను జక్కని. నా ధరిత్రిఁ !
తే॥ గేస్తురా, లనునాఖ్యచే గృహిణి వెలయు;
నాలు, పెండ్లాము, రాణి, యిల్లా, లనంగ
భార్య దనరును దా, త్తన బానిస, యన
వరవ్రఁ, డన దాసికాఖ్యలౌ (గరళకంఠ!) 4

టీ॥ గరళకంఠా ! = విషముఁ గళమునఁదాల్చిన ఈశా ! ముగుద = ముగ్ధ అను శబ్దమునుండి పుట్టినది. ముద్దరాలు = ముద్ద + అలు (పేదాది శబ్దంబులకు అలుశబ్దము పరంబగు నపుడు రుగాగమంబగు. బాల. వ్యా.) గోల, బేల, ఈ నాలుగును పదునాఱు సంవత్సరములుగల పడుచు పేర్లు. Maiden

గట్టివాయి=పెద్దగొంతుగలది, గయ్యాళి, ఝాఁగ, ఈ 3 ను, దుష్టస్త్రీకిఁ బేరులు. Quarrelsome Woman

ఐదువ, ముత్తైదువ, అయిదువరాలు=(పసుపు, కుంకుమ, గాజులు, మట్టెలు, మంగళసూత్రము, ఈ ౫ ను, గలది.) ఈ మూఁడును బుణ్యస్త్రీకిఁ బేరులు. House Wife

పేరంటాలు, జక్కని, యీ రెండును లోకాంతరమునొంది దేవత్వమునొందిన సువాసినికిఁ బేరులు.

A lucky woman whose husband survives her

గేస్తురాలు, ఆలు, పెండ్లాము, రాణి, యిల్లాలు, ఈ అయిదును గులసతికిఁ బేర్లు. Wife

తొత్తు, బానిస, పరవుడు, ఈ మూఁడును దాసికిఁ బేర్లు.

A servant woman

సీ॥ కన్నియ, కన్నె, నాఁ గన్యకుఁ, బేర్లొప్పు;
జవరాలు, కొమరాలు, జవ్వని, యనఁ
దనరు యువతి, ప్రౌఢ, యన గట్టివయసుది,
యనఁ, బ్రౌఢదాల్పునీయాహ్వయములు
ముసలి, మిండలకోర, ముప్పదియాఱేండ్లు
చనినది, యనుపేళ్ల నెనయు లోల;
ముసలిది, ముదుసలి, ముదియ, పెద్ద, న నివి
యాఖ్యలై తనరు వృద్ధాంగనకును;
ఆ॥ చెడిప, అంకులాడి, చెడ్డతొయ్యలి, వెలి
చవులుగనిన దనఁగ జార దనరు;
నిలను విటులదూత, యెడకాఁడు, కుంటెన
కాఁ, డనంగఁ దనరు గరళకంఠ! 5

టీ॥ గరళకంఠా ! = ఈశ్వరా ! కన్నియ, కన్నె, ఈ రెండును పెండ్లిగాని పడుచు నామములు. A Virgin

జవరాలు, కొమరాలు, జవ్వని, యీమూఁడును యువతికిఁ బేర్లు. A Young Woman

ప్రౌఢ, గట్టివయసుది, యీ రెండును ముప్పదియేండ్ల వయసుగల స్త్రీకిఁ బేర్లు. A grownup Woman

ముసలి, మిండలకోర, ముప్పదియాఱేండ్లు చనినది. యీ 3 ను, లోల యనుదానికి బేరులు.

A woman of thirtysix years

ముసలిది, ముదుసలి, ముదియ, పెద్ద, యీ ౪ ను వృద్ధాంగనకుఁ బేరులు. An old woman

చెడిప, ఱంకులాడి, చెడ్డతొయ్యలి = చెడ్డగుణముగలయాఁడుది, వెలిచవ్వలు గనినది=పరపురుషసాంగత్యము ననుభవించినది, యీ నాలుగును జారిణికిఁ బేరులు.

Harlot; debacherous woman

విటకాఁడు, కుంటెనకాఁడు=కామినీకాముకులకు సాంగత్యముఁ గుదుర్చువాఁడు, యీ రెండును దాయపుగాని బేరులు.

A pimp

తే॥ వేల్పుజానిస, వెలయాలు, వేడ్కకత్తె,
లంజె, బోగముచాన, వెల్లాటకత్తె,
పడపుఁజెలి, యాఁటచేడియ, గడనకత్తె,
నాఁగ నివి వేశ్యకాఖ్యలౌ నగనివేశ ! 6

టీ॥ నగనివేశ ! = ఓ విశ్వేశ్వరా ! వేల్పుజానిస=దేవతల జానిస, వెలయాలు=ధనకాంత, వేడ్కకత్తె, లంజె, బోగముచాన=భోగాంగన, వెల్లాటకత్తె=అధికముగా నాడునది, పడపుఁజెలి = ధనార్జనముసేయుచెలి, ఆటచేడియ = అభినయముసేయు యువతి, గడనకత్తె = ఆర్జనగల భామిని; యీ తొమ్మిదియును, వేశ్యకు నామములు. a dancing girl

ఆ॥ వెచ్చకాఁడు, బొజుగు, వేఁడుకకాఁడు, మిండఁడు, ననుపుకాఁడు, మిండగీఁడు,
లంజెకాఁడు, నా ధరం, జను బల్లవ
నామధేయములు పినాకహస్త! 7

టీ॥ పినాకహస్తా! = త్రిశూలముహస్తమందుగల ఈశ్వరా! వెచ్చకాఁడు=ధనము వెచ్చించువాఁడు, బోజుఁగు, వేడుకకాఁడు= వేడుకలుగలవాఁడు, మిండఁడు, నవుపుకాఁడు=మెత్తనముగల వాఁడు, మిండగీఁడు, లంజెకాఁడు = లంజెనుంచినవాఁడు. ఈ యేడును విటుని పేళ్ళు. A gallant

ఆ॥ కోడెకాఁ, డనంగ గోవాళ్లు, నాఁగను
యువజనాఖ్య లొప్పుచుండు రెండు;
నాగవాస, మనఁగ నామమౌ వేశ్యాజ
నంబు మేళమునకు, (నంబికేశ!) 8

టీ॥ అంబికేశ ! = ఈశ్వరా ! కోడెకాఁడు = జవ్వనముగల వాఁడు, గోవాళ్ళు = యువకుఁడు, ఈ రెండును యువజనునకుఁ బేర్లు. నాగవాస=ఇది భోగము మేళమునకు నామము.

A set of dancing girls

సీ॥ నెలఁతుక, క్రాల్గంటి, పొలఁతుక, ముద్దియ,
వాలుఁగంటి, మగువ, పడఁతి, మడఁతి,
చెలి. మచ్చెకంటి, యుగ్మలి, యింతి, తొయ్యలి,
నవలా, కలువకంటి, నాఁతి, గోతి,
పూఁబోఁడి, చిగురాకుఁబోఁడి, పైదలి, మించు
బోఁడి, ముద్దులగుమ్మ, పొలఁతి, కొమ్మ,
ప్రోయా, లువిద. తీఁగెబోఁడి, చేడియ, యించు
బోఁడి, యన్ను, వెలంది, బోటి, జోటి,
తే॥ చాన, తెఱవ, నెలందుక, చామ, లేమ,
చెలువ, యెలనాఁగ, చిలుకలకొలికి, కలికి,

తలిరుఁబోఁడి, యలరుఁబోఁడి, నెలఁత, పొల్తి,
గరిత, యతివ, నా స్త్రీసమాఖ్యలు (మహేశ!) 9

టీ॥ మహేశా! నెలఁతుక, కాల్గంటి = ప్రకాశించు కనుగవ గలిగినది. పొలఁతుక, ముద్దియ, వాలుగంటి = విశాలనేత్ర, మగువ, పడఁతి, మడఁతి, చెలి, మచ్చెకంటి = మత్స్యమువంటి నేత్రములు గలది. నాఁతి గోతి, పూఁబోఁడి=పుష్పమువంటి మేను గలది. చిగురాకుఁబోఁడి=చిగురాకువంటి మేనుగలది. పైఁదలి, మించుబోఁడి=మెఱపువంటి మేనుగలది, ముద్దులగుమ్మ=ముద్దు లొలికించునది, పొలఁతి, కొమ్మ, ప్రోయాలు, ఉవిద, తీఁగె బోఁడి=తీఁగవంటి మేనుగలది. చేడియ, ఇంచుబోఁడి = చెఱకు వలె మధురమైన మేనుగలది, అన్ను, వెలఁది, బోఁటి, జోటి, చాన, తెఱవ, వెలఁదుక, చామ, లేమ, ఎలనాగ, చిలుకల కొలికి=చిలుకముక్కులవంటి కనుగొనలు గలది, కలికి, తలిరుఁ బోఁడి=చిగురువలె మృదువైన మేనుగలది, అలరుఁబోఁడి=పూవు వలె మృదువైన మేనుగలది, నెఁలత, పొల్తి, గరిత, అతివ. ఈ ౪౮ యును, స్త్రీకి నామములు.

A Woman

తే॥ చెలిమి, నేస్తంబు, పొందు, నా స్నేహ, మలరు
నెచ్చెలి, యనుంగు, సంగాతి, నేస్తకాఁడు,
సంగడీఁ, డన జెలికాఁ, డవంగఁ దనరు
స్నేహితునకు సమాఖ్యలు (శ్రీమహేశ!) 10

టీ॥ శ్రీమహేశా! చెలిమి, నేస్తంబు, పొందు, ఈ మూఁడును నెయ్యమునకు నామములు. A Friendship

నెచ్చెలి, అనుఁగు, సంగాతి, నెస్తకాఁడు, సంగడీఁడు, చెలికాఁడు, ఈ అఱును, మిత్రునకు నామములు. A Friend

సీ॥ దొంగ, తెక్కలికాఁడు, దొరకోలుసన్న్యాసి,
ము, చ్చెత్తు బరికాఁడు, ముడియవిడుపు,
తెరవాటుకాఁడు, కత్తెరదొంగ, చేవాఁడి
కాఁడు, వల్లడికాఁడు, కన్నగాఁడు,
మునిముచ్చు, గడిదొంగ, యనఁ దస్కరాఖ్య లొఁ
జెండిపోతు, గరాసు, మొండికట్టె,
టకటొంకు, టాటోటు, టక్కులాఁడు, పిసాళి,
టక్కరి, ముడికాఁడు, ఠవళికాఁడు,
తే॥ కల్లరియు, గొంటు, కైలాటకాఁడు, చెడుగు,
బేరజము, కుచ్ఛితుఁడు, దోసకారి, చెనఁటి,
పాలసుఁడు, నాలిబూతంబు. పలువ, తులువ,
కూళ, గడు, సన వర్తిల్లుఁ, గుజను పేళ్ళు. 11

టీ॥ దొంగ,, తెక్కలికాఁడు = బందిపోటువేయువాఁడు; దొరకోలు సన్న్యాసి=వేసమువేసి నమ్మకము కలిగించి సొమ్ము నపహరించువాఁడు, ముచ్చు, ఎత్తుబరికాఁడు, ముడియవిడుపు = ద్రవ్యమ్ముగల మూటలముడులను విప్పెడివాఁడు, తెరువాటుకాఁడు=త్రోవకొట్టువాఁడు, కత్తెరదొంగ = కత్తిరించి దొంగిలించువాఁడు, చేవాఁడికాఁడు = దొంగిలించుటకు కరలాఘవముగలవాఁడు; వల్లడికాఁడు=కొల్లగొట్టువాఁడు, కన్నగాఁడు=కన్నములు వేయు దొంగ, మునిముచ్చు=మునివలె నేమియుఁ దెలియనటుండి దొంగతనముసేయువాఁడు, గడిదొంగ = మర్మజ్ఞుఁడైన చోరుఁడు; ఈ ౧౩ ను, దస్కరునకుఁ బేర్లు. A Thief

చెండిపోతు=మూఢబుద్ధిగలవాఁడు, గరాసు, మొండికతె. టకటొంకు, బాపాటు, టక్కులాఁడు = అనృతములాడువాఁడు, పిసాళి. టక్కరి, ముడికాఁడు, తపశీకాఁడు=మోసగాఁడు, కల్లరి= అసత్యమాడువాఁడు. గొంటు, కైలాటగాఁడు = మాయోపాయము లెఱింగినవాఁడు, చెడుగు, జారజము, కుచ్చితుఁడు, దొసకారి, పాపములఁజేయువాఁడు. చెనఁటి, పాలసుడు, నాలిబూతము, పలువ, తులువ, కరాళ్, గడుసు, ఈ ౨౪ పేర్లను కుత్సితునకు నామములు. A wicked man

ఆ॥ పాప, బుడుత, చిఱుత, పట్టి, సిసువు, కందు,
కూన, నిసువు, బిడ్డ, కుఱ్ఱ, బొట్టె,
యనఁగ శిశుసమాఖ్యలగుఁ గొమరుండు, నాఁ
గొడుకు, నాఁ కుమారకుండు వెలయు. 12

టీ॥ పాప, బుడుత, చిఱుత, సిసువు, పట్టి, కందు, కూన, నిసువు, బిడ్డ, కుఱ్ఱ, బొట్టె, ఈ ౧౧ ను, శిశువునకుఁ బేర్లు. Child

కొమరుఁడు=కుమారశబ్దమునకుఁ దద్భవము. కొడుకు=ఈ రెండును పుత్త్రుని పేళ్ళు. Son

ఆ॥ వటుసమాఖ్యలగుచు వసుధలోఁ గొండిక
వాఁ, డనంగఁ బడుచువాఁ, డనంగఁ
బిన్నవాఁ, డనంగఁ జిన్నవాఁ, డనఁగను
(వినుతగుణసనాథ! విశ్వనాథ!) 13

టీ॥ వినుతగుణసనాథ = కొనియాడఁబడెడు గుణములతోఁ గూడినవాఁడా! విశ్వనాథ = ఓ కాశీవిశ్వేశ్వరా! కొండికవాఁడు,

పడుచువాఁడు, పిన్నవాఁడు, చిన్నవాఁడు, ఈ నాలుగును వటు
సమాఖ్యలు=బాలుని పేర్లు. A lad

సీ॥ గిటక, పొట్టి, కుఱుచ, గిట్ట గుజ్జనఁగ, వా
మనుఁ, డొప్పుఁ; జను నపస్మారిపేళ్ళు
వెడఁగు, వేఁదుఱు, వెఱ్ఱి, వీఱిఁడి, వేఱిఁడి,
వెంగలి, వెంబరవి, త్తనంగఁ
జతురునకును బేళ్ళు, జాణ, దంట, వలంతి,
వెరవరి, ప్రోడ, నేర్పరి యనంగఁ,
బ్రన్ననివాఁడు, రూపరి, చూడఁగలవాఁడు,
చక్కనివాఁడు, నా జగతిఁ బరఁగు

తే॥ సుందరాకారవంతుండు, సొగసుకాఁడు,
వన్నెకాఁ, డన శృంగారి వసుధ వెలయు
నంధకునిపేళ్ళు, చీకు, గ్రుడ్డ, నఁగ మూఁగ
మూవ, యన మూకనామముల్ (దేవదేవ!) 14

టీ॥ దేవదేవ=దేవాధీశ్వరా! గిటక, పొట్టి, కుఱుచ, గిట్ట,
గుజ్జు. ఈ ౫ ను, వామనుని పేర్లు. Dwarf

వెడఁగు, వేఁదుఱు, వెఱ్ఱి, వీఱిఁడి, వేఱిఁడి, వెంగలి, వెంబర
విత్తు, యీ యేడును నపస్మారికి నామములు. An ehileptic

జాణ, దంట, వలఁతి, వెరవరి = ఉపాయశాలి, ప్రోడ=
ప్రౌఢుడు; నేర్పరి=నేర్పుగలవాఁడు. ఈ ౬ ను, కుశలునకుఁబేర్లు.
A skilful man

ప్రన్ననివాఁడు, రూపరి=అందముగలవాఁడు, చూడఁగల

వాఁడు. ఇతరులకుఁ జూడఁదగినవాఁడు, చక్కనివాఁడు. ఈనాలుగును సౌందర్యవంతుని నామములు.

A beautiful man

సొగసుకాఁడు, వన్నెకాఁడు ఈరెండును శృంగారవంతుని పేర్లు.

A bean

చీకు, గ్రుడ్డి, ఈ రెండును అంధుని పేర్లు.

A blind man

మూఁగ, మూవ, యీ రెండును మూకునిపేర్లు.

A dumb man

క॥ కాయము పేళ్లై వెలయును
మే, యన నొడ, లనఁగ మేను, మెయి యనభోగ్య
ప్రాయము పేళ్ళగుఁ బరువము,
ప్రాయము, జవ్వన, మనంగ భావజదమనా! 15

టీ॥ భావజదమనా ! = మన్మథాంతకా ! మే, ఒడలు, మేను, మెయి, యీ నాలుగును కాయమునకుఁ బేర్లు.

Body

పరువము, పాయము, జవ్వనము, ఈ 3 ను, ప్రాయమునకు నామములు.

Youth

తే॥ నెఱులు, కురులు, వెండ్రుకలు, నా నెఱిక, లనఁగఁ
గొప్పు, తుఱు, మన వేనలి, క్రొవ్వెద, యన
గేశ ధమ్మిల్లములు, మించుఁ గీలుగంటు,
క్రొమ్ముడి, యనంగఁ గేశబంధమ్మగు భవ!

టీ॥ భవ=ఈశ్వరా ! నెఱులు, కురులు, వెండ్రుకలు, నెఱికలు, ఈనాలుగును కేశముల నామములు. The hair

కొప్పు, తురుము, వేనలి, క్రొమ్ముడి, ఈ నాలుగును ఉవిదల కొప్పునకుఁ బేర్లు. A female, s hair tied up

కీలుగంటు, క్రొమ్ముడి, ఈ రెండును గేశబంధములకుఁ బేర్లు. A knot of hair

తే॥ నొసలు, నెన్నొసల్, నుదురు, నెన్నుదు, రనంగఁ
దనరు ఫాలంబు, చూడ్కి, చూపనఁగ, నొప్పు
నాహ్వయము లీక్షణమునకు నక్షికాఖ్య
లలరుగన్, కన్ను, నా (నభ్రకేశ!) 17

టీ॥ అభ్రకేశ ! = ఈశ్వరా ! నొసలు, నెన్నొసలు, నుదురు, నెన్నుదురు, ఈ నాలుగును, ఫాలభాగమునకుఁ బేళ్లు.
Forehead

చూడికి, చూడ్కి, చూపు, ఈ మూఁడును వీక్షణమునకుఁ బెర్లు. Sight

కను, కను, కన్ను, ఈ మూఁడును, అక్షికిఁ బేర్లు. Eye

క॥ వీను, లనఁ జెవి, లనంగా
జానుగు, లన నాహ్వయములు శ్రవణంబులకున్
గౌ, నన నడు, మనగా నభి
ధానములగు మధ్యమునకుఁ దరుణేందుధరా! 18

టీ॥ తరుణేందుధరా ! = బాలచంద్రుని ధరించినవాఁడా ! ఈశ్వరా ! వీను, చెవి, జానుగు; ఈ మూఁడును చెవికిఁ బేర్లు.
Ear

కౌను, నడుము, ఈ రెండును నడుమునకుఁ బేర్లు.
Waist

తే॥ అక్కు, ఱొమ్ము, ఎద, బోర, నా నలరు వక్ష;
మాస్యమున కొప్పుచుండు నాఖ్యలు మొగంబు,
మోర, మోము, మనఁగ; జేరొప్పు నూరువునకుఁ
బెంపెడ, యనంగఁ గుఱుపు, నా (నందివాహ!)

టీ॥ నందివాహ=నందీశ్వరుఁడు వాహనముగాగల ఈశ్వరా! అక్కు, ఱొమ్ము, ఎద, బోర, యివి నాలుగును వక్షమునకు నాహ్వయములు Chest

మొగము, మోర, మోము, యీ 3 ను, ముఖమునకుఁ బేర్లు. Face

పెంపెడ, కుఱుపు, యీరెండును ఊరువు సమాఖ్యలు. Thigh

తే॥ వదనగుహ, మొప్పు నారు, నా వాయి, యనఁగఁ
బల్లు, పలుఁ నాఁగ దంతంబు, పేర్ల వెలయుఁ;
బెదవి, వాతెఱ, మోవి, యన్పేర్పుఁ దనరు
చుండు నోష్ఠంబు (శీతాంశుఖండమౌళి!) 20

టీ॥ శీతాంశుఖండమౌళి !=అర్ధచంద్రుని శిరస్సునధరించిన యీశ్వరా! నోరు, వాయి, యీ రెండును నోటిరంధ్రమునకు నామములు. Mouth

పల్లు, పలు, యీరెండును దంతమునకు నామములు. Tooth

పెదవి, వాతెఱ, మోవి, యీ మూఁడు, నధరోష్ఠమునకు సమాహ్వయములు. Lip

క॥ కయి, యనఁ గై, నాఁ గే, లనఁ
జెయి, యనఁ జై, నాఁగఁ జెయ్యి, చే, నా హస్తా

హ్వాయములగు (నన్నపూర్ణా
పి్రియవల్లభ! కాశికాపురీవరనిలయా!) 21

టీ॥ కయి, కై, కేలు, చెయి, చై, చెయ్యి, చే, ఈ ౭ ను, హస్తమున కాహ్వాయములు, అన్నపూర్ణాపి్రియవల్లభ!= పార్వతీ పా్రణేశ్వరా! కాశికాపురీవరనిలయా=కాశీనగరనివాసా !

Hand

క॥ ఎద, యన డెందం, బనఁగా
మది, యనఁగా నెడఁ, దనంగ మఱి యుల్లము, నా
హృదయమునకు నవి యొసఁగును
విదితంబుగ నాహ్వాయములు (విశ్వాధిపతీ!) 22

టీ॥ విశ్వాధిపతీ! = విశ్వేశ్వరా! ఎద, డెందము, మది, ఎడఁద, ఎడ, ఉల్లము, ఈ ౬ను, హృదయమున కాహ్వాయములు.

Heart

క॥ లోఁజెయ్యన, నఱచెయ్యనఁ,
గాఁ జెల్లును బేళ్లు రెండు కరతలమునకున్
మీఁజెయ్యనఁ, బెడచెయ్యియు
నాఁ జనుఁ గరచరమభాగనామములు (శివా!) 23

టీ॥ శివా=ఈశ్వరా! లోఁజెయ్యి=చేతి లోభాగము, అఱ చెయ్యి=లో హస్తము, ఈ రెండును అఱచేతికిఁ పేర్లు.

Palm

మీఁజెయ్యి=హస్తముయొక్క పైభాగము, పెడచెయ్యి=చేతి యొక్క పెడభాగము, ఈ రెండును హస్తముయొక్క చరమ భాగమునకు నాఖ్యలు,

The heart of the hand

ఆ॥ పొట్ట, పొక్కిలి, కడుపు, బొజ్జ, బొఱ్ఱ, యనంగ
నొప్పుచుండు నాఖ్య లుదరమునకు
నాభిబిలమునకును నామధేయములగు
బొడ్డు నాఁగ, మఱియుఁ బొక్కిలనఁగ. 24

టీ॥ పొట్ట, పొక్కిలి, కడుపు, బొజ్జ, బొఱ్ఱ, ఈ 5 ను, ఉదరమునకు నామములు.

Belly

బొడ్డు, పొక్కిలి, ఈ రెండును నాభికి పేర్లు.

Naud

తే॥ వెన్ను, నంగను వీఁపు, నా వెనుకమేను,
నాఁగఁ జరమాంగమున కొప్పు నామములుగఁ
బుఱ్ఱె, తలపాల, నాఁ బుఱ్ఱె, పుఱియ, నాఁగ
పాలమున కాఖ్యలై యొప్పు (ఫాలనేత్ర!) 25

టీ॥ ఫాలనేత్రా! =నుదుటియందు కన్నులుగల యీశ్వరా! వెన్ను, వీఁపు, వెనుకమేను=ఒడలి వెనుక భాగము, ఈ మూఁడును వీఁపునకుఁ బేరులు.

Back

పుఱ్ఱె, తలపాల, పునుక, పుఱియ, యీ 4 ను, గపాలమున కాహ్వయములు.

Skull

క॥ అడు, గంజ, హజ్జ, యనఁగా
బుడమిఁ బదంబునకు నామములు విలసిల్లున్
మెడ, కుత్తు, కఱ్ఱు, గొంతన,
నడరు గళంబునకుఁ బేళ్ళనంగధ్వంసీ! 26

టీ॥ అనంగధ్వంసీ ! = అనంగుని ధ్వంసము సేసిన మహే
శ్వరా ! అడుగు, అంజ, హజ్జ, ఈ3ను, చరణమునకు నామములు.

Foot

మెడ, కుత్తుక, అఱ్ఱు, గొంతు, ఈ ఁను, గళమునకుఁబేర్లు.

Neck

ఆ॥ బువ్వ, వంటకంబు, బోనంబు, మెతుకు, కూ,
డోగిరము, పసాద, మోరె, మనఁగ
నన్నమొప్పుఁ, జేల, మలరుఁ బుట్టంబు, దు
వ్వలువ, చీర, కోక, వలువ యనఁగ. 27

టీ॥ బువ్వ, వంటకము, బోనమ్ము మెతుకు, కూడు, ఓగి
రము, పసాదము, ఓరెము, ఈ యెనిమిదియు అన్నమున కాహ్వ
యములు.

Food

పుట్టము, దువ్వలువ, చీర, కోక, వలువ, ఈ ఙను, వస్త్రము
నకు నామములు.

Cloth

తే॥ మెసవె, నారోగిణ మొనర్చె, మెక్కెఁ, దినియెఁ,
గుడిచె, నారగించెను, బసాపడియె, నమలె,
సాపడె ననంగ నొప్పు బోజనము సేసె
ననుట కివి యాఖ్యలై (యీశ! యభ్రకేశ!) 28

టీ॥ అభ్రకేశ ! = ఈశ ! మెసఁగెను, మెసవెను, ఆరోగిణ
మొనర్చెను, మెక్కెను, తినియెను, కుడిచెను, అరగించెను, పసా

పడిజెను, కమలెను. సాపడెను, ఈ ౯ యును, భోజనము సేసె ననుటకుఁ బేర్లు.

Ate

క॥ నాన, యన సిగ్గు, సిబ్బితి,
నా నివి వ్రీడాపదంబునామంబు లగుం;
బానము, సేయుట, పేళ్ళగు
నానుట, త్రావు, టనఁ ద్రాగుటనఁ, గ్రోలుటనన్. 29

టీ॥ నాన, సిగ్గు, సిబ్బితి, ఈ 3 ను, లజ్జకు నామములు.

Shame

అనుట, త్రాగుట, త్రావుట, క్రోలుట, ఈ ४ ను, పానము సేయుటకు నామములు.

To drsnk

ఆ॥ తళియ, పళ్లెరంబు, తెలె, హరివాణంబు,
తట్టి, కంచ, మనఁగఁ దనరు బాత్ర,
చెల్లుఁ జషకమునకుఁ బేళ్ళు, డబ్బర, కోర,
గిన్నె, యనఁగ, (రజతగిరినివాస!) 30

టీ॥ రజతగిరినివాస! = కైలాసపర్వతమున వసించు నీశ్వరా! తళియ, పళ్లెరము, తెలె, హరివాణము, తట్టి, కంచము యీ ఆఱును భోజనపాత్రమున కాఖ్యలు.

Metal plate

డబ్బర, కోర, గిన్నె, యీ మూఁడును బానపాత్రముల కాహ్వయములు.

A Brass bowl

తే॥ నతికిఁ బేళ్ళొప్పు జోత, దండము, జోహారు,
మ్రొక్కు, జేజే, యనంగఁ గేల్మొగిచెఁ, గొలిచె

నెఱఁగెఁ, జేమోడ్చె, నన నమస్కృతి యొనర్చె
ననుట కివి యాఖ్యలగు (నీశ! యభ్రకేశ!) 31

టీ॥ ఈశ! అభ్రకేశా! జోత, దండము, జొహరు, మ్రొక్కు జేజే, ఈ ౫ ను, నమస్కారమునకుఁ బేర్లు.

Salute

కేల్మొగిచెను = చేతులు జోడించెను, కొలిచె, ఎఱగెను, చేమోడ్చెను=చేతులు జోడించెను, ఈ ౪ ను, నమస్కారముఁ జేసెననుటకు, నామములు,

Saluted

తే॥ ఒప్పు, శయనించుటకును, బన్నుండెఁ, బండె,
బవ్వడించెఁ, బరుండెను, బవ్వళించె,
న త్తమిల్లె నన నమ్మఱి మెత్త, సెజ్జ,
పఱపు, పాన్పనఁ దగు శయ్య ఫాలనేత్ర! 32

టీ॥ ఫాలనేత్ర! = నుదుటనేత్రముగలవాఁడా! ఈశ్వరా! పన్నుండెను, బండెను, పవ్వళించెను, అత్తమిల్లె, పవ్వడించెను, పరుండెను, ఈ ౬ ను, శయనించెననుటకుఁ బేర్లు.

Lay down

మెత్త, సెజ్జ, పఱపు, పాన్పు, ఈ ౪ను, శయ్యానామములు.

Bed

తే॥ ఒప్పు ధ్వనిపేళ్ళు రొద, యన నులిపునాఁగ,
సద్దనంగను, గూఁతనాఁ, జప్పుడనఁగ,
నలుకుఁడన, రోదనముసేసె ననుట కాఖ్య
లెసఁగు నఱచెను, వాపోయె, నేడ్చె నన.ఁగ. 33

టీ॥ రొద, ఉలివు, సద్దు, కూఁత, చప్పుడు, అలుకుడు, ఈ ౬ ను, శబ్దమునకు నామములు.

Noise

అఱచెను, వాపోయెను, ఏడ్చెను, ఈ 3 ను, విలపించె ననుట కాహ్వయములు.

Wept

క॥ అగుఁ జేఁప నీరువట్టన,
దగ, దప్పియు, దూప యనఁగ దాహంబునకున్
నగవు, నగు, నవ్వు, నవు, నా
నగు నాఖ్యలు హాసమునకు నగజాధీశా! 34

టీ॥ అగజాధీశా! నీరు, వట్టు, దగ, దప్పి, ఈ ౪ ను, దాహమున కాఖ్యలు.

irst

నగవు, నగు, నవ్వు, నవు ఈ ౪ ను, హాసమున కాఖ్యలు.

Laughter

క॥ చాగమునాఁ, బుడు, కనఁగా,
నీగి, యనఁగ, నిడుట యనఁగ, నీవియనంగాఁ,
దేగము, నాఁ, బెట్టుడు, నాఁ
ద్యాగమునకు నాఖ్యలగుచు ధరఁ బరఁగు (శివా!)

టీ॥ శివా! = ఈశ్వరా! చాగము, పుడుకు, ఈగి, యిడుట ఈవి, తేగము, పెట్టుడు, యీ ౭ ను, దానమునకు నామములు.

Gift

ఆ. ఎలసె. బెరసె, హత్తెఁ, గలసె, నదికెఁ, జెందెఁ,
బొందె, దొరసెఁగూడె, నొందె, నెనసె,
ననఁగ సక్తమయ్యెననుటకు నివి యాఖ్య
లగు (గిరీశ! యీశ! యభ్రికేశ!) 36

టీ॥ గిరిశ! యీశ! అభ్రకేశ! ఎలసెఁ, ఔరసెఁ, హత్తెఁ, ఎనసెఁ, అదికెఁ, చెందెఁ, పొందెఁ, పొరసెఁ, కూడెఁ, ఒందెఁ, చెనకెఁ, యీ ౧౧ ను, గలిసికొనెననుటకుఁ బేర్లు.

Met

ఆ॥ ఎడసెఁ, బాసె, వేఱుపడెఁ, బురివిచ్చె, నా
నలరు భేదమయ్యె ననుట పేర్లు;
స్వవశమయ్యె ననుట కవుఁ, జేపు లోనయ్యె,
నగ్గమయ్యెననఁగ, (నసమనేత్ర!) 37

టీ॥ అసమనేత్ర! = బేసికన్నులుగల యీశ్వరా! ఎడసెఁ, బాసెఁ, వేఱుపడెఁ, పురివిచ్చెఁ, యీ ౪ ను, వియోగ మొందెననుట కాహ్వయములు.

Separated

లోనయ్యె, అగ్గమయ్యె, యీ ౨ ను స్వవశమయ్యెననుట కాఖ్యలు.

Yielded

ఆ॥ అగు గృహీతమయ్యెననుటకుఁ బేళ్ళగ
పడియెఁ, జేపడియెను, బట్టుపడియెఁ,
జిక్కుపడియెఁ దగిలెఁ, జిక్కెఁ, దగుల్పడె
ననఁగ, నగనివేశ! యభ్రకేశ! 38

టీ॥ నగనివేశ! అభ్రకేశ! = యీశ్వరా! అగపడియెఁ = అధీనమయ్యెను, చేపడియెను=చేతఁజిక్కెను, పట్టుపడియెను= పట్టుచిక్కెను, చిక్కుపడియెను, తగిలెను, చిక్కెను, తగుల్పడెను, యీ ౮ యును, గృహీతమయ్యెననుట కాఖ్యలు.

Seized

తే॥ అనియె, నొడివె, వక్కాణించె, నాడెఁ, జెప్పె,
వినిచె, వాక్రుచ్చెఁ, బలికెనాఁ, జను, వచించె
ననుట; కాలించె, నాలకించెను, వినె, నన
నలరు నవధరించెనటంట కాఖ్య లీశ. 39

టీ॥ ఈశ !=యీశ్వరా ! అనియెను, నొడివెను, వక్కాణించెను, ఆడెను, చెప్పెను, వినిచెను, వాక్రుచ్చెను, పలికెను, యీ ౧౦ యును, చెప్పెననుటకుఁ బర్యాయపదములు.

Told

ఆలించెను, ఆలకించెను, వినెను, యీ 3 ను, అవధరించెననుటకు నాఖ్యలు.

Heard

క॥ కనియెను, చూచెను, కాంచెను,
కనుగొనెఁ, గన్గొనె, ననంగఁ గలయవి పేళ్లై
చనువీక్షించెనటంటకు;
ఘనతరగోరాజగమన! కాయజదమనా ! 40

టీ॥ ఘనతరగోరాజగమనా ! = గొప్పదైన వృషభముపై సంచరించువాఁడా ! కాయజదమనా ! = మన్మథాంతకా ! కనియెను, చూచెను, కాంచెను, కనుగొనెను, కన్గొనెను, యీ ౫ ను, వీక్షించెననుటకుఁ బేర్లు.

Saw

క॥ చనుఁ, గృతగమనుఁడనయ్యెద
ననుటకు నామమ్ములగుచు నవని నరిగెదఁగా,
జనియెదఁ, బోయెద, నేగెద,
బనివినియెదననెడునట్టి పలుకులు రుద్రా! 41

టీ॥ రుద్రా! ఈశ్వరా! అరిగెదను, చనియెదను, పోయెదను, ఏగెదను, పనివినియెదను ఈ ౫ ను బయలుదేరెద ననుటకు నాహ్వాయములు.

I will go

ఆ॥ ద్విగుణమున కభిఖ్య, లగు నిబ్బ డిమ్మడి,
జంట, దంట, దుగయు, జమిలి, రెట్టి,
యినుమడి, యన; మిథునమున కాఖ్య లగు జోడు,
దోయి, కవ, యనంగ, (ధూతకలుష). 42

టీ॥ ధూతకలుష=పోఁగొట్టఁబడిన కలుషము గలవాఁడా! ఇబ్బడి, ఇమ్మడి, జంట, దంట, దుగ, జమిలి, రెట్టి, (రెంట) ఇనుమడి ఈ 8 ద్విగుణమున కాహ్వాయములు. Double జోడు, దోయి, కవ ఈ 3 ను మిథునమునకు నామములు. pair

సీ॥ ఒం, డొక్కఁ, డొకటి, యొక్కొం, డన నగు నేక;
మీరు,రెం,డిరు,నాఁగ, నెసఁగుద్వయము;
తిగ, మూఁడు, మూ ర్నాగఁ, దగుఁ ద్రయి, తీవంచ
నలు, నాల్గు, చౌ, యన నగుఁ జతుష్కఁ;
మెసఁగుఁ జౌవంచ,య్యై, దే, ననఁ బంచకం
బా, ఆఱుమూఁ, డిత్తి గనఁగ నొప్పు
షట్కంబు; ఋషిసంఖ్య సత, చక్కఁపడగ, యే
డన నొప్పు నష్టసం ఖ్యకును బేష్క
తే॥ తనరు నిరునాలు, గెనిమిది, దచ్చి, యనఁగఁ;
బలఁగు నీరాఱు, పండ్రెండు, బార, యనఁగ

ద్వాదశమునకు నాఖ్యలు, ధరణియందు
శైలజానాథ! ప్రమథసంచయసనాథ! 43

టీ॥ ప్రమథ సంచయసనాథ=కొనియాడఁబడిన, కపుణతోఁ గూడుకొనినవాఁడా! శ్రీవిశ్వనాథా=ఈశ్వరా! ఒండు, ఒక్కఁడు, ఒక్కటి, ఒక్కింత, ఈ 4 ను ఏకమునకు నాహ్వయములు. One; ఈరు, రెండు, ఇరు ఈ 3 ను ద్వయమునకు నామములు Two; తిగ, మూఁడు, మూడు ఈ మూఁడును త్రయికి నాహ్వయములు. Three; తీవంచ=మూఁడునొకటియు, నలు, నాలుగు, చౌ ఈ 4 గును చతుష్కమునకు నామములు. Four; చౌవంచ=నాలుగునొకటి, అయిదు, ఐదు, ఏను ఈ మూఁడును పంచకమునకు పేర్లు. Five; ఆఱు, ఇరుమూఁడు, ఇత్తిగ=ఇరు + తిగ. రెండుమూఁడులు ఈ 3 ను షట్కమునకుఁబేర్లు. Six; సత=సప్త, చక్కవగడ=ఆరునొకటి, ఏడు, ఈమూఁడును సప్తసంఖ్యకుఁబేర్లు, Seven ఇరునాలుగు, ఎనిమిది, దచ్చి ఈ 3 ను అష్టకమునకాఖ్యలు. Eight; ఈరాఱు, పండ్రెండు, బార ఈ మూఁడును ద్వాదశమునకాఖ్యలు. Twelve.

తే॥ జరిగె, నూడెను, జాఱెను, నుఱికె, వెళ్లె,
బాఱెఁ, బఱచెను, దొలగె, నప్పలుకులెల్ల
నవనిలోనఁ బలాయితుఁడయ్యె ననుట
కాఖ్యలై యొప్పుఁ జంద్రరేఖావతంస! 44

టీ॥ చంద్రరేఖావతంస=చంద్రరేఖ భూషణముగా గలవాఁడా ! = ఈశ్వరా ! జరిగె, ఊడెను, జాఱెను, ఉఱికె, వెళ్లె, పాఱె; పఱచెను, దొలఁగె ఈ 8 యును పరుగెత్తె ననుటకు నామములు. Ran

క॥ వేంచేసెను, వచ్చెన్, జను
దెంచెను, విచ్చేసె, నరుగుదెంచె, నన(గ నే
తెంచె, నన నయ్యె నాగతుఁ
డంచుం బలుకుటకు నాఖ్య లంబరకేశా!

టీ॥ అంబరకేశా! = ఆకాశమే కేశముగా గలవాఁడా!. వేంచేసెను, వచ్చెను, చనుదెంచెను, విచ్చేసెను, అరుదెంచెను, అరుగుదెంచెను, ఏతెంచెను,=(ఏగు + తెంచె) ఈ అఱును ఆగతుఁ డయ్యె ననుట కాహ్వాయములు. Came

తే॥ నాటిసుత, నాఁటినుండియు, నాఁటగోలె,
నాటఁబట్టి, నాఁడుమొదలు, నాఁగనాహ్వ
యమ్ములయ్యెఁదదారభ్య యనుట కవని
వినుత కరుణాసనాథ! శ్రీవిశ్వనాథ॥ 46

టీ॥ వినుత కరుణాసనాథ! శ్రీవిశ్వనాథ! నాఁటిసుత, నాఁటినుండి, నాఁటఁగోలె, నాఁటఁబట్టి, నాఁడుమొదలు ఈ 5 ను తదారభ్య (ఆ దినము మొదలుకొని) అనుటకు నాఖ్యలు.

Since then

తే॥ వైరమునకును ధర సమాహ్వయము లమరుఁ,
గంటు, పగ, మచ్చరంబు, సూ, డొంటమి, యన
వలపు, కూరిమి, మేలు, నా నలరుఁ బేళ్ళు
మోహమునకును (శారదాంబుదనిభాంగ!) 47

టీ॥ శారదాంబుదనిభాంగ=శరత్కాల మేఘమువంటి శరీరముగల ఈశ్వరా!; గంటు, పగ, మచ్చరము, సూడు, ఒంటమి

ఈ 5ను విరోధమునకు నామములు. Enmity వలపు, కూరిమి, మేలు ఈ మూఁడును మోహమునకుఁ జేర్లు. Love

క॥ పెనఁకువ, జగడము, కయ్యం,
బని, బవరము, కలను, చివ్వ, యాలము, పోట్లా,
టన దురము పోరు నాఁగాఁ
జను యుద్ధంబునకుఁ జెప్ప, (చంద్రార్ధధరా!) 48

టీ॥ చంద్రార్ధధరా = అర్ధచంద్రుని ధరించిన ఈశ్వరా ! పెనఁకువ, జగడము, కయ్యము, అని, బవరము, కలను, చివ్వ, ఆలము, పోట్లాట, దురము, పోరు ఈ11ను యుద్ధమున కాఖ్యలు. Quarrel

ఆ. పదమదంబు సేసెఁ, జక్కాడె, నుగ్గాడెఁ
జదిపెఁ, బీఁచమడఁచె, జంపెఁ, గెడపె,
నుఱుముచేసెఁ, దుృంచెఁ, బరిమార్చెఁ, దెగటార్చె,
మన్నిగొనియెఁ, దునిమె, మడిపె, ననఁగ. 49

తే॥ హతముఁ గావించె ననుటకు, నాఖ్యలయ్యె
మనిపె, నేలెను, బ్రతికించె, మంచెఁ, బోృచె,
సాఁకె, నన నొప్పు నాఖ్యలు సరవితోడ
నరయఁ బోషించె ననుటకు (నంబికేశ!) 50

టీ॥ అంబికేశ=ఈశ్వరా ! పదమదంబుసేసె, చక్కాడె, నుగ్గాడె, చదిపె, పీఁచమడఁచె, చంపె, కెడపె, నుఱుముసేసె, తుృంచె, పరిమార్చె, తెగటార్చె, మన్నిగొనియె, తునిమెను, మడిపెను ఈ 14 ను సంహరించెననుట కాహ్వాయములు. Killed

మనిపెను, ఏలెను, బ్రతికించెను, మంచెను, బ్రోచెను, సాఁకెను, ఈ ఆఱును బోషించె ననుటకు నాహ్వాయములు. Preserved

క॥ ధరలో శూరాహ్వాయములు
బరగున్ మొనకాఁ, డనంగఁ బం, టనఁగాఁ బో
టరి, యన వడిగలవాఁ, డన
బిరు, దన వాఁడిమగ, డనఁగ! భీమ! కపర్ది! 51

టీ॥ భీమ! కపర్ది=ఈశ్వరా! మొనకాఁడు, బంటు, పోటరి, వడిగలవాఁడు, బిరుదు, వాఁడిమగఁడు ఈ 6 ను శూరుని కాహ్వాయములు. Hero

తే॥ బాసట, యనంగఁ దోడ్పాటు, నా సమాహ్వా
యంబు లగుచుండు రెండు సా హాయ్యమునకు;
నాఖ్యలు శుభంబునకును ల, గ్గనఁగ బా, గ
నంగ మే, లన లెస్స య నంగ (నీశ!) 52

టీ॥ ఈశ ! బాసట, తోడ్పాటు, ఈ రెండును సాహాయ్యమునకు నామములు. Aid లగ్గు, బాగు, మేలు, లెస్స ఈ నాలుగును క్షేమమునకుఁబేర్లు. Welfare

ఆ॥ కూలె, నీల్గెఁ జచ్చెఁ, గాలంబు సేసెను,
గెడసె, సమసె, నాఱె, మడిసెఁ, జెల్లెఁ,
బెద్దనిదురవోయె, బిద్దె, దోరెను, గంతుఁ
గొనియెఁ ననుట పేళ్ళ గును మృతునకు. 53

టీ॥ కూలెను, నీల్గెను, చచ్చెను, కాలంబుచేసెను, కెడసెను, సమసెను, ఆరెను, మడిసెను, పెద్దనిద్దురపోయెను

చెల్లెను, ఒద్దెను. పోయెను, గంటుగొనియెను ఈ 13ను మరణించె ననుట కాప్యాయములు. Died

సీ॥ తిమ్మనైనది, యన దిన్ననైనది, యన
జానైన, దనఁగ బాగైన, దనఁగ
నాణె మైన, దన విన్నాణ మైనది, యన
మానైన, దనఁగ లెస్సైన, దనఁగఁ
బిన్ననైనది యనఁ, జెన్నైన దన నలు
వైనది యనఁగఁ జెల్వైన దనఁగఁ
బొనరినయది యన, నొనరిన, దనఁగఁ జొ
క్కటమైన, దనఁగఁ జక్కని,దనంగ
సొబగైన, దనఁ గను సొంపైన దనఁ, గొమ
రైనది, యన గొనబైన, దనఁగఁ
దోరమైన, దనఁ సిం, గారమైనది, యన
మేలైన, దనఁగఁ, మెచ్చైన, దనఁగ

తే॥ మురువుగలయది యొప్పైన, దొఱవుగలది
యందమైనది, తనరిన, దలరినట్టి,
దనఁగఁ బరగిన, దనఁబేళ్ళు తనరుచుండు
మంజులంబైన దనుటకు మదనదమన! 54

టీ॥ మదనదమన = స్మరాంతకా! తిమ్మనైనది, తిన్ననైనది, జానైనది, బాగైనది, నాణెమైనది, విన్నాణమైనది, మానైనది, లెస్సైనది, పిన్ననైనది, చెన్నైనది, నలువైనది, చెల్వైనది, పొన

రినయది, ఒనరినది, చొక్కటమైనది, చక్కనిది, సొబగైనది, సొంపైనది, కొమరైనది, గొనబైనది, తీరమైనది, సింగారమైనది, మేలైనది, మెచ్చైనది, ముదువుగలయది, ఒప్పైనది, ఒఱపుగల యది, అందమైనది, తనరినది, అలరినట్టిది, పరగినది ఈ 31 యు మంజులమైన దసుటకు నాహ్వయములు.

Beautiful

తే॥ కపుర, మనఁ గప్పురం, బనఁ గప్ర, మనఁగ
బుడమిఁ గర్పూరమొప్పు; దాంబూలమొప్పు
వీడియము, వక్కలాకులు, విడెము, తమ్మ
లంబు, వీడెంబు, వీడ్య, మనం బురారి॥ 55

టీ॥ పురారి = ఈశ్వరా! కపురము, కప్పురము, కప్రము ఈ 3 ను కర్పూరమునకుఁ బేర్లు. Campher వీడియము, విడియము, వక్కలాకులు, విడెము, తమ్మలము, వీడెము, వీడ్యము ఈ 6 ను తాంబూలమునకు నామములు.

Folded betel leaves with areca nut etc;

తే॥ వెలయుచుండును సిరి, లచ్చి, కలిమి, యనెడు
పేళ్ళ సంపద; యెద్దడి, పేదఱికము
లేమి, నిప్పచ్చరము, నెవ్వ, లేమి, డనఁగ
నలరు దారిద్ర్యమునకు నాఖ్యలు, గిరీశ॥ 56

టీ॥ సిరి, లచ్చి, కలిమి, ఈ మూఁడును సంపదకు నామములు. Riches ఎద్దడి, పేదఱికము, లేమి, నిప్పచ్చరము, నెవ్వ, లేమిడి, ఈ 6 ను దారిద్ర్యమునకు నాహ్వయములు.

poverty

తే॥ మగతనం, బన గం, డన మగఁటిమి, యనఁ
పౌరుషంబున కాఖ్యలై పరగుచుండు;
నుక్కు, చేగ, దిటము, చేవ, యుదుటు, గట్టి,
దిట్ట, ముఱది, బిగువు నాగ ధృతికిఁబేస్మ॥ 57

టీ॥ మగతనము, గండు, మగఁటిమి, ఈమూఁడును పౌరుషమునకు నామములు. Manliness ఉక్కు, చేగ, దిటము, చేవ, ఉదుటు, గట్టి, దిట్టము, ఉఱది, బిగువు ఈ 9 యును ధైర్యమునకు నామములు. Bravery

తే॥ బద్ధు, నా బొంకు, నాగ దబ్బర, యనంగ
గల్ల, నాగ హుళిక్కి నాఁ జెల్లుఁ బేష్మ
ధర ననత్యమునకును; సత్యంబు, పరగు
నిజ, మనఁగ నిక్కువం, బన నిక్కు, మనఁగ॥ 58

టీ॥ బద్ధు, బొంకు, దబ్బర, కల్ల, హుళిక్కి ఈ 5 ను అసత్యమునకు నామములు. Untruth నిజము, నిక్కువము, నిక్కము ఈ మూఁడును సత్యమునకు నామములు. Truth

క॥ బెడఁద, దెస, చేటు, చేట్పా
టొౡడ, వాత్రిం, బంగలార్పు, గోరంబు, దొసం
గిడుమ, వెత, కస్తి, యంగద,
కడగండ్ల,నఁ జను విపత్తు గౌరీరమణా! 59

టీ॥ గౌరీరమణా = పార్వతీశ్వరా! బెడఁద, దెస, చేఁటు, చేట్పాటు, గొడవ, అత్తిము, అంగలార్పు, వెత, గోరము, దొసఁగు, ఇడుమ, కస్తి, అంగద, కడగండ్లు ఈ 14 ను విపత్తునకు నామములు. Misfortune

క॥ వెల, జట్టి, విలువ, రో, యనఁ
గల నుడువులు దనరుచుండుఁ గ్రయనామములై;
వెలయంగ వంగసము, నాఁ
గౌల, మన వంగడము, నాఁగఁ గులమొప్పు (శివా!)

టీ॥ శివా! వెల, జట్టి, విలువ, రో, ఈ నాలుగు క్రయమునకుఁ బేరులు, Price వంగసము, కౌలము, వంగడము, ఈ మూఁడును గులమునకు నామములు. Family

క॥ క్రమ్మఱ, నెప్పటి, వెండియుఁ,
గ్రమ్మఱి, తిరుగన్, మఱిన్, మరల, మగుడను, నా
నిమ్మహిఁ బునఃపదంబున
కిమ్ములనివి యాఖ్యలగు (మహీధరచాపా!) 61

టీ॥ మహీధరచాపా! (మేరువు) పర్వతమును విల్లుగాఁ బట్టినవాఁడా! ఈశ్వరా! క్రమ్మఱన్, ఎప్పటి, వెండియున్, క్రమ్మఱి, తిరుగన్, మఱి, మరలను, మగుడను, ఈ ౮ ను, పునఃపర్యాయములు. Again;

క॥ ఒకమరి, యొకపర్రి, యొకమాఱ్
టొకసా, రొకతేప, యనఁగ నొకపా, రనఁగా
నొకపిడుత, యొకతూ, కన
నొకతడవ, యనంగ మఱియు నొకతూరియనన్.

తే॥ ఏకవాకం బనుట కొప్పు నిన్ని పేళ్ళుఁ
జగతిఁ బల్మాఱు, వేమాఱు, సారె, పెక్కు
మాఱు, లెన్నేనిమాఱ్లనఁ బరఁగు నాఖ్య
లగుచు నివి బహువారంబులనుటన్ (కీశ!) 63

టీ॥ ఈశ! ఒకమఱి, ఒకపరి, ఒకమాఱు, ఒకసారి, ఒకతేప, ఒకపాటి. ఒకపెడుత, ఒకటాకు, ఒకతడవ, ఒకతూరి, ఈ ౧౦ ను, ఏకవారమనుటకు నామములు. Once. పల్మాఱు, (రూ.) పలుమఱు, పలుమాఱు, వేమాఱు, సారె, పెక్కుమాఱులు, ఎన్నైనిమాఱులు, ఈ౭ను, మాటిమాటికి ననుటకు నామములు.
Oftan

తే॥ త్వరితమునకొప్పుఁ బేళ్లు చెచ్చెరను, సరగ,
వేగిరము, వేగ, వేళము, వెసను, వడిగ,
గ్రక్కునను, గ్రద్దన, ననంగ గ్రన్న, ననఁగ
గొబ్బునను, దిగ్గున, ననంగఁ గుధరచాప! 64

టీ॥ కుధరచాప ! = పర్వతమును ధనుస్సుగాఁ బట్టిన ఈశ్వరా! చెచ్చెర, సరగ, వేగిరము, వేగ, వేళము, వెసన్, వడిగన్, గ్రక్కునన్, గ్రద్దనన్, క్రన్నన, గొబ్బునను, దిగ్గునన్, ఈ ౧౨ ను, త్వరితముగా ననుటకు నామములు. Speedily

క॥ కలవు వివరింపఁగా నా
ఖ్యలు వరుసన్, నిర్గమించె, ననుటకు ధరలో
వెలువడియె, వెళ్లె, వెడలెను,
వెలలె, ననం జిత్రప్రకాశ! విశ్వాధిపతీ! 65

టీ॥ చిత్రప్రకాశ! విశ్వాధిపతీ! వెలువడియెను, వెళ్లెను, వెడలెను, వెలలెను. ఈ ౪ ను, ప్రయాణము చేసె ననుటకు వాఖ్యలు. Went out

క॥ వినుతి యొనరించె ననుటకుఁ
దనరున్ నామంబులగుచు ధరపై నగ్గిం

చెను, గై వారము సేసెన్,
గొనియాడెను, బొగడె ననఁగఁ గొండాడె ననన్.

టీ॥ అగ్గించెను, కైవారముసేసెను = స్తుతిసేసెను. కొనియాడెను, పొగడెను, కొండాడెను, ఈ ౫ ను, వినుతి యొనర్చె ననుటకుఁ బర్యాయములు. Praised

సీ॥ చుట్టలు, విందులు, చుట్టాలు, బందుగు,
లనఁ జను బంధుసమాహ్వయములు
వరలు నన్యుఁడు, లాఁతివాఁ, డనఁగా వింత
వాఁ, డనఁగాఁ బెఱవాఁ, డనంగ
వ్యాజంబునకు నామమౌ నెపం బనఁగ, న
న్వేషించె ననుట కౌ వెదకె, నెమకె,
నరసె, రోసె, ననంగ నారసెఁ, దడవె, నాఁ
గాంక్షకుఁ బేరులౌఁ గ్రమముతోడఁ
తే॥ గ్రిచ్చ, కోరిక, తమి, కోర్కి, యిచ్ఛ, యనఁగ
నెప్పుడు, నెడపక, యుడుగక, యెల్లపు, డన
నిచ్చ, యనయంబు, నాఁగను నిచ్చలనఁగఁ
దనరు నాఖ్యలు సంతతం బనుట (కీశ!) 67

టీ॥ ఈశా! చుట్టలు, విందులు, చుట్టాలు, బందుగులు, ఈ ౪ ను, బాంధవులకు నామములు. Relations లాఁతివాఁడు, వింతవాఁడు, పెఱవాఁడు, ఈ ౩ ను, అన్యుఁ డనుట కాఖ్యలు. Stranger. నెపము అనునది వ్యాజమునకుఁ బేరు. Pretet వెదకెను, నెమకెను, అరసెను, రోసెను, తడవెను, ఆరసెను, ఈ ౬ ను, అన్వేషించె ననుటకు నామములు, Investigated

కచ్చు. కోరిక, తమి, కోర్కి, ఇచ్ఛ, ఈ ౫ ను, కాంక్షకు నాహ్వ యములు. Hope ఎప్పుడు, ఎడపక, ఉడుగక, ఎల్లప్పుడు, నిచ్చు, అనయము, నిచ్చలు. ఈ ౭ ను, సంతతముఅనుట, కాహ్వ యములు. Always

సీ॥ తనరుఁ, బ్రవేశించె ననుటకు నాఖ్యలు
తూకొనెఁ, జొచ్చెను, దూఱె, ననఁగ
సంప్రహితాడితుఁజేసె ననుటకుఁ బేళ్ళగుఁ
దాఁచెఁ, గాళ్ళంగుమ్మెఁ, దన్నె, ననఁగ
నాలస్య మొనరించె ననుటకుఁ జెల్లు నా
మమ్ములు తడసెను, మసలె, ననఁగఁ
ద్యక్తంబు గావించెననుటకు నాఖ్యలు,
వీడెను, వదలెను, విడిచె, ననఁగఁ
తే॥ దాఱుమాఱయ్యె, వీడ్వడెఁ, దడఁబడె, నన
నాఖ్యలొప్పు విపర్యస్తమయ్యె ననుట;
కలరుఁ బరిహరించె ననుట కాహ్వాయము లడిఁచెఁ,
గొట్టె, మొత్తెను, మోఁదె, నాఁ (గుధరనిలయ!)

టీ॥ కుధరనిలయ ! = కైలాసపర్వతము నిలయముగాఁ గల ఈశ్వరా ! తూకొనెను, చొచ్చెను, తూఱెను, ఈ 3 ను, ప్రవేశించెననుటకు నామములు. Entered తాఁచెను, కాళ్ళఁగుమ్మెను తన్నెను, ఈ 3 ను, పదతాడనము చేసెననుటకాఖ్యలు. Kicked తడసెను, మసలెను, ఈ ౨ ను, ఆలసించెననుటకు నాహ్వాయములు. Delayed వీడెను, వదలెను, విడిచెను,. ఈ 3 ను; పరిత్యజించెననుటకు నామములు. Left తాఱుమాఱయ్యెను, వీడ్వడెను, తడఁబడెను, ఈ 3 ను, హెచ్చుతక్కువ అయ్యెననుటకు

నామములు. Confused అడిఁచెను, కొట్టెను, మొత్తెను, మోఁదెను, ఈ ౪ ను, ప్రహరించెననుటకు శబ్దాంతరములు.
Beat

సీ॥ ముందట, నెదుటను, మ్రోల, ముంగల, నాఁగ
నాఖ్యలౌ సముఖమం దనుట కభవ!
అలయిక, బడలిక. యలపు, పేద యనంగ
శ్రమమున కాఖ్యలౌ శమనదమన!
తాలిమి, యోరుపు, తాలిక నాఁగను
క్షమకు నాహ్వాయములౌఁ జర్మవసన.
తవళి, బవంతంబు, టక్కు, దుత్తారంబు,
వెడ్డు నా ఛద్మమౌ విషమనేత్ర!
తే॥ వెఱపనఁగ, నెద యనఁగను, వెఱయనంగ,
నళుకనఁగ భీతి కాఖ్యలౌ నసితకంఠ!
నిమ్మళంబన, నెమ్మి నా, నెమ్మది యన,
దనరుఁ బేళ్ళు నిరాతఁకమునకు నీశ! 69

టీ॥ అభవా! ముందటను, ఎదుటను, మ్రోలన్, ముంగలన్, ఈ ౪ ను, సముఖమం దనుటకుఁ బర్యాయపదములు. Before శమనదమన! = మృత్యుంజయా! అలయిక, బడలిక. అలపు, సేప, ఈ ౪ను, శ్రమమునకు నామములు. Wearness. చర్మవసనా! తోలునువలువగాఁదాల్చునీశ్వరా! తాలిమి, ఓరుపు, తాలిక (ఓర్పు) = ఈ 3 ను, క్షమకుఁ బేర్లు. Patience. విషమనేత్ర! = బేసికంటివాఁడా! తవళి, బవంతము, టక్కు, దుత్తారము, వెడ్డు, ఈ ౫ ను, కపటమునకునాఖ్యలు. Trick వెఱపు,

దర, వెఱ, ఆశంకము, ఈ 4 ను, భీతికిఁ బేర్లు. Fear నిమ్మళము, నెమ్మి, నెమ్మది, ఈ 3 ను, భయములేమికిఁ బేరులు. Quiet

సీ॥ అసదు, కొంచెము, సైక, మలఁతి, యన్నువ, చిన్న
నలికంబు, సన్నంబు, నాఁ దనర్చు
స్వల్ప; మెక్కుడు నాఁగఁ జాల, నెంతేనియు,
మిగులఁ, దద్దయుఁ, దద్ద, మిక్కిలియనఁ,
బెద్దయు నను నివి పేళ్ళగు భృశముగా
ననుటకు, నుత్కటమయ్యె ననుట
కగుఁ బేళ్ళు; వెగ్గలమయ్యెఁ, గ్రిక్కిఱిసె, వె
క్కసమయ్యె, నను నివి క్రమముతోడ

ఆ॥ సగ్గెఁ, గుందె, డొంకెఁ, దగ్గెను, సడలెను,
గ్రుంగె, నుబ్బణంగె, స్రుక్కె, ననఁగఁ
దనరుఁ బేళ్ళు క్షీణదశనొందెననుటకు
(నీశ్వరీసనాథ! విశ్వనాథ!) 70

టీ॥ ఈశ్వరీసనాథ ! = పార్వతీదేవితోఁ గూడుకొన్నవాఁడా ! విశ్వనాథా ! = విశ్వేశ్వరా ! అసదు, కొంచెము, సైకము, అలఁతి, అన్నువ, చిన్న, నలికము, సన్నము, ఈ 8 ను, స్వల్పమునకుఁ బేరులు. A little. ఎక్కుడు, చాలన్, ఎంతేనియున్, మిగులన్, దద్దయున్, తద్ద, మిక్కిలి, పెద్దయున్, ఈ 8 ను, అధికముగా ననుటకు నామములు. Much వెగ్గలమయ్యెను, క్రిక్కిఱిసెను, వెక్కసమయ్యెను. ఈ 3 ను, హెచ్చయ్యెననుటకు నామములు. **Exceeded.** సగ్గె, కుందె, డొంకె, తగ్గె, సడలె, క్రుంగె, ఉబ్బణంగె, స్రుక్కె, ఈ 8 యు, క్షీణదశనొందెననుటకు నామములు.

**Decreased**

ఆ॥ మించు, వాసి, మేలు, మేటి, పెచ్చెచ్చు, న
నధికమునకు సాఖ్యలగుచు వెలయు,
బనులు, నాఁగఁ జెయువు, లనఁ జేఁత, లననొప్పు
గర్మమునకుఁ బేళ్ళు చర్మవసన! 71

టీ॥ చర్మవసన! = తోలును వలువగాఁ దాల్చినవాఁడా! మించు, వాసి, మేలు, మేటి, పెచ్చు, ఎచ్చు, ఈ ౬ ను, అధికము అనుటకు బర్యాయపదములు. Excess పనులు, చెయువులు, చేఁతలు, ఈ 3 ను, కర్మమునకు నామములు. Work

ఆ॥ అనిపె. ననిచెఁ, బనిపెఁ, బనిచె, నంపెను, బంపెఁ,
బుచ్చె, గెలువుమనియె, బొమ్మటనియె,
ననఁగ నివి సమాఖ్యలగును బ్రస్థాపించె
ననెడు క్రియకు నీశ! యభ్రకేశ! 72

టీ॥ అభ్రకేశ! ఈశా! అనిపె, అనిచె, పనిపె, పనిచె, అంపెను, పంపె, పుచ్చె, గెలువుమనియె, పొమ్మటనియె, ఈ౯ను ప్రయాణము చేయించెననుటకు నామాంతరములు. Sent

తే॥ కొదువ కొద, కుందు, తగ్గు, తక్కువ, కొఱంత,
వెలితి, కొఱ, లొచ్చు, కడమ నా వెలయు న్యూన
సమభిధానము, లర, సాము, సగము, సవము,
నాఁగ నర్థాహ్వయంబులౌ నాగభూష! 73

టీ॥ నాగభూషా! = ఈశ్వరా! కొదువ, కొద, కుందు, తగ్గు, తక్కువ, కొఱఁత, వెలితి, కొఱ, లొచ్చు, కడకు, ఈ ౧౦ ను, న్యూనతకు నామములు. Deficiency అర, సాము, సగము, సవము, ఈ ౪ ను, నర్థమనుటకు నాహ్వయములు. Half

తే॥ పేళ్లు పశ్చాత్తనుటకును జెల్లు వెనుకఁ,
బిదపఁ, దర్వాతఁ, బదఁపడి, పిమ్మట, నన
మునుపు, మును, మున్ను, తొలి, తొల్లి, ముందు, తొలుత
ననఁగఁ బూర్వపదార్థాఖ్యలౌ (గిరీశ!) 74

టీ॥ గిరీశా! వెనుకను, పిదపను, తర్వాతను, పదఁపడి, పిమ్మట, ఈ 5 ను, పశ్చాత్తనుటకు నామములు. After-words, మునుపు, మును, మున్ను, తొలి, తొల్లి, ముందు, తొలుత, ఈ 7 ను, పూర్వమనుటకు పర్యాయపదములు.

Before

ఆ॥ పాఱుఁబోతు, పిఱికి, పంద, కోఁచ యనంగఁ,
బేళ్లు దనరు సమరభీరువునకు;
దిట్ట, యుక్కుతునియ గట్టిడెందంబువాఁ,
డనఁగ ధైర్యవంతుఁ డలరు (నీశ!) 75

టీ॥ ఈశ! పాఱుబోతు, పిఱికి, పంద, కోఁచ, యీ 4 ను, యుద్ధభీతుని పేర్లు. Coward దిట్ట, ఉక్కుతునియ, గట్టి డెందమువాఁడు, యీ 3 ను, ధైర్యశాలి నామములు.

A Brave man

తే॥ పౌఁజు, చేరువ, మొత్తంబు, బారు, తుట్టము,
దండు, పరి, గమి, కూటువ, పిండు, దాఁటు,
మూఁక, దళ, మను పేళ్ళు సమూహమునకు
(భుజగవరహార! యవిముక్తపురవిహార!) 76

టీ॥ భుజగవరహార! = గొప్ప సర్పమును కంఠహారముగాఁ ధరించువాఁడా! అవిముక్తపురవిహార! = కాశీపురమునందు విహరించువాఁడా! పౌఁజు, చేరువ, బారు, తుట్టము,

చండు, పరి, గమి, కూటువ, పిండు, దాటు, మూఁక, దళము, ఈఁ౩ను, సమూహమునకు నామములు. An army, a group.

సీ॥ పూనె, నూనెను, దాల్చె, నానెను, మోచె, నా
వహియించె ననుట కౌ (నహివిభూష!)
నామము లుచ్చాటనముచేసె ననుటకు
వరుసతోఁ దఱిమెను, బఱపె, వెలిచెఁ,
దోలెను, ఱొప్పె, నా (ద్రుహిణాద్రిసురనుత!)
త్రిప్పెను, నాఁ గ్రిమ్మఱించె, ననఁగ
మగిడించె, ననఁగను మఱలించె, నన సమా
హ్వాయములై పరఁగు నివర్తితంబు
తే॥ చేసె ననుటకు (సురమునిసిద్ధసేవ్య!)
యుడ్డగించెను, నా నిల్పె, ననఁగ నాఁగె,
నన నివారించె ననుటకు నాఖ్య లమరు
నగసుతానాథ! (గుహగజాననసనాథ!) 77

టీ॥ నగసుతానాథ! = పార్వతీశ్వరా! గుహగజానన సనాథ! = కుమారస్వామి, విఘ్నేశ్వరులతోఁ గూడుకొన్నవాఁడా! పూనెను, ఊనెను, తాల్చెను, ఆనెను, మోచెను, ఈ ౫ ను, వహియించె ననుటకుఁ బేర్లు. Wore అహివిభూషా! తఱిమెను, పఱపెను, వెలిచెను, తోలెను, ఱొప్పెను, యీ ౫ ను, ఉచ్చాటనము చేసెననుటకు నామములు. Routed. త్రిప్పెను, క్రమ్మఱించెను మగిడించెను, మఱలించెను, ద్రుహిణాదిసురనుత! = బ్రహ్మాది దేవతలచేఁ గొనియాడఁబడువాఁడా! యీ ౫ ను, వెనుకకుఁ బోద్రోలె ననుటకు నామములు. Turned back. సురమునిసిద్ధ సేవ్య! = దేవతలచేతను, మునీంద్రులచేతను, సిద్ధులచేతను

సేవింపబడు నీశ్వరా! అడ్డగించెను, నిల్పె, అడఁగెను, యీ 3 ను, నివారించె ననుటకు నామములు. Obstructed.

తే॥ దండ, చేరువ, సంగడి, దాపు, చెంత,
సరస, చెంగట, యొద్ద, డగ్గఱ, కురంగ,
టంద, పజ్జయు, నా సమీపాఖ్య లమరు
రమ్యధవళాంగ! కలశనీరధినిషంగ! 78

టీ॥ రమ్యధవళాంగ! = అందమైన తెల్లని శరీరముగలవాఁడా! కలశనీరధినిషంగ! = పాలసముద్రము అమ్ములపొదిగా గలవాఁడా! దండ, చేరువ, సంగడి, దాపు, చెంత, సరస, చెంగట, ఒద్ద, డగ్గఱ, కుఱంగట, అంద, పజ్జ. యీ ౧౨ ను, సమీప మనుటకు నామములు. Nearby.

తే॥ అచట, నచ్చట, నచ్చోట, నందు, నాడ,
నచొట, నచ్చొట, నక్కడ, నయ్యెడ, నట,
ననఁగఁ దత్ప్రదేశంబునం దనుట కాఖ్య
లయ్యె భక్తవిధేయ! యార్యాసహాయ!

టీ॥ భక్తవిధేయ! = భక్తులయందు కృపచే విధేయునివలె సంచరించువాఁడా! ఆర్యాసహాయా! = పార్వతిదేవికి సహాయభూతుఁడవైనవాఁడా! అచట, అచ్చట, అచ్చోట, అందు, ఆడ, అచొట, అచ్చొట, అక్కడన్ = ఆ దెసను, అయ్యెడన్ = ఆ తావున, అటన్=ఈ౧౦ను, ఆ ప్రదేశమం దనుటకాహ్వయములు.
There

క॥ ఇరుకెలఁకుల, నిరువంకల,
నిరుదెస, నిరుచక్కియందు, నిరుపక్కియలం,

దిరుగేశ్రీవల, నిరుగడ, నన
బొరిఁ బేళ్ళగు నుభయపార్శ్వములననుట కజా! 80

టీ॥ అజా ! = జన్మరహితుఁడవైన యీశ్వరా ! ఇరుకెలఁకులఁ, ఇరువంకలఁ, ఇరుదెసఁ, ఇరుచక్కియందుఁ, ఇరుపక్కియలందుఁ, ఇరుగ్రేవలఁ, ఇరుగడఁ, యీ 8 ను, రెండు పార్శ్వములందు ననుటకుఁ బేర్లు. On both sides.

క॥ నవముగ ధరలో నీ మా
నవవర్గువు వేడ్కఁ జదివినను వ్రాసిన మా
నవులకు ననవరతంబును
శివుడవిముక్తేశ్వరుండు చెలువం బొసఁగుఁ. 81

టీ॥ ఈ మానవవర్గు చదివినవారికిని, వ్రాసిన వారికిని, (గృతిపతియగు) కాశీవిశ్వేశ్వరుఁడు శాశ్వతసంపద లొసంగును.

మానవవర్గు సమాప్తము.



# స్థావర వర్గు

—:O:—

## Names of immovable things

సీ॥ వలిదిప్ప, వడఁకుగుబ్బలి, చలిమిరిమల,
గట్టులఱేఁడు, ముక్కంటిమామ,
మంచుకొం, డన హిమక్ష్మాధరాఖ్యలు చను;
వేలుపుఁగొండ, జేజేలగట్టు,
పుత్తడిగుబ్బలి, పునుకకంచమువాని
విల్లు, నా మేరువు పేళ్ళు వెలయు
వెలిదిప్ప, ముక్కంటిమల, వెండికొండ, నాఁ
గైలాసపర్వతాఖ్యలు సెలంగు
తే॥ వెలయుఁ దరిగొండ, కవ్వంపుమల, యనంగ
మందరాఖ్యలు కడపటిమల, యనంగఁ
జుట్టుగొం డనఁ దనరు నీక్షోణియందుఁ
జక్రివాళాద్రి (వృషవాహ! శైలగేహ!) 1

టీ॥ వృషవాహ ! = ఎద్దునెక్కువాఁడా! శైలగేహ ! = పర్వతమే నిల్లుగాగలవాఁడా ! విశ్వేశ్వరా ! వలిదిప్ప = చలికొండ, వడఁకుగుబ్బలి = వణఁకఁజేయుకొండ, చలిమిరిమల = చల్లదనపుఁగొండ, గట్టులఱేఁడు = పర్వతములకు రాజు, ముక్కంటి

మామ = త్రిలోచనునకు మామ, మంచుగొండ=మంచుగల పర్వతము, యీ ౬ ను, హిమాలయపర్వతమున కాహ్వాయములు.

Himalaya Mountain

వేలుపుగొండ = దేవతలు నివసించు భూధరము, జేజేలగట్టు = సురాద్రి, పుత్తడిగుబ్బలి = బంగారపుగొండ, పునుకకంచమువానివిల్లు = కపాలము కంచముగాఁ దాల్చిన శివుని ధనుస్సు, యీ ౪ ను, మేరుపర్వతము నామములు.

Meru Mountain

వెలిదిప్ప = తెల్లనైనకొండ, ముక్కంటిమల = ఈశ్వర నివాసమగు పర్వతము, వెండికొండ = రజతాచలము, యీ 3 ను, కైలాస భూధరము నాహ్వాయములు. Mount Kailas.

తరిగొండ=త్రచ్చుపర్వతము, కవ్వపుమల = (పాలసముద్రమును దేవాసురులు త్రచ్చినప్పుడు) కవ్వముగానున్న కొండ, యీ ౨ ను, మంథరపర్వతమునకుఁ బేర్లు.

Mandhara Mountain

కడపటిమల = కొనకుండు కొండ, చుట్టుగొండ = పుడమి చుట్టును నుండు కొండ, యీ ౨ ను, చక్రవాళ పర్వతమునకు నాహ్వాయములు.

Range of mountains rounding of earth

ఆ॥ తూర్పుఁ గొండ, నాఁగఁ దొలుగట్టు నాఁగను
బొడుపుగుబ్బ, లనఁగ బూర్వశిఖరి
పరఁగుఁ; గ్రుంకుమెట్ట, పడమటికొండ, నా
వెలయు నస్తశిఖరి విశ్వనాథ! 2

టీ॥ తూర్పుఁకొండ = తూర్పుదిక్కుననుండుకొండ, తొలుగట్టు = పూర్వదిక్కునందలి పర్వతము, పొడుపుగుబ్బలి = రవి

యుదయించు పర్వతము. The eastern mountain ఈ 3ను ఉదయాచలమునకు నామములు.

క్రుంకుమెట్టు = రవి యస్తమించు పర్వతము, పడమటి కొండ = పశ్చిమ దిక్కునను౦డు పర్వతము, యీ ౽ ను, అస్తాచలము పేర్లు. The Western Mountain.

తే॥ ఒప్పు గిరిపేళ్ళు, మల, గట్టు, తిప్ప, మెట్ట,
కొండ, గుబ్బలి నా మేరుకుధరచాప!
ఱాయి, నాఁ గల్లు, నంగను ఱా, యనంగ
శిల కభిఖ్యలు, దగు నిల శేషభూష! 3

టీ॥ శేషభూష ! = శేషుఁడే భూషణముగాఁ గలవాఁడా విశ్వేశ్వరా ! మల, గట్టు, తిప్ప, మెట్ట, కొండ, గుబ్బలి, యీ ౬ ను, పర్వతమునకు నాహ్వయములు. Mountain

ఱాయి, కల్లు, ఱా=యీ3ను, శిలకు నాహ్వయములు.
Stone

తే॥ పల్లె, కొట్టిక, కొటిక, కుప్పమ్ము, నాఁగ
నూరనఁగ, గ్రామనామంబు లొప్పుచుండు
బట్టణంబున కాఖ్యలు పరగుచుండుఁ
బ్రోలు, లనఁగ వీ, డనంగను (శూలపాణి!) 4

టీ॥ శూలపాణి ! = హస్తమునందుఁద్రిశూలముఁగలవిశ్వేశ్వరా! పల్లె, పల్లియ, కొట్టిక, కొటిక, కుప్పము, ఊరు, యీ ౫ను గ్రామ నామములు. Village. ప్రోలు, వీడు, యీ ౨ను, బట్టణమున కాహ్వయములు. A town.

ఆ॥ ఉనికిపట్టు, తావు, మనికిప, ట్టిర, విల్లు,
తెంకి, యిక్క, నట్టు, టెంకి, యిమ్ము,

నెలవు, గీము నా౯గ నఖిరునివాసదే
శంబునకును బేళ్లు (చంద్రమౌళి!) 5

టీ॥ చంద్రమౌళి ! = చంద్రుని శిరస్సున ధరించిన విశ్వేశ్వరా! ఉనికిపట్టు, తావు, మనికిపట్టు, ఇరవు, ఇల్లు, తెంకి, ఇక్క, నట్టు, టెంకి, ఇమ్ము, నెలవు, గీము, యీ ౧౨ ను, నివాసస్థానమునకుఁ బేర్లు. A house.

సీ॥ తెంకాయ చెట్టనఁ టెంకాయమ్రాను, నన
నారికేళం బొప్పు (నగనివేశ!)
మావిమ్రాను, ననఁగను మామిడిచెట్టన
నామ్రభూజం బొప్పు (నభ్రకేశ!)
యత్తిమ్రాను, నన మేడి, యనఁగ నౌదుంబర
ధారుణీజం బొప్పు (మేరుచాప!)
యరఁటి, యనంటి, నా నంశుమత్ఫలధారు
ణీరుహం బగు (ధరణీశతాంగ!)
తే॥ యలరుఁ దుంబీశలాటు సమాఖ్య లాను
గంబు, సొరకాయ, వదరు, నా (గరళకంఠ!)
తా, డనంగను దాడి, నా తాళభూరు
హంబునకు నాఖ్యలై యొప్పు (నంబికేశ!) 6

టీ॥ ధరణీశతాంగ ! = భూమియే రథముగాఁగలవాఁడా ! అభ్రకేశ ! మేరుచాప ! గరళకంఠ ! అంబికేశ ! నగనివేశ ! తెంకాయచెట్టు, టెంకాయమ్రాను, ఈ ౨ ను, నారికేళవృక్షమునకుఁ బేర్లు. Cocoanut tree. మ్రావిమ్రాను, మామిడిచెట్టు ఈ ౨ ను, రసాలవృక్షము పేర్లు. Mango tree. అత్తిమ్రాను, మేడి, ఈ ౨ ను, ఔదుంబర వృక్షమునకు నామములు. Fig tree.

తరటి, అనఁటి, ఈ ౨ ను, గదళీవృక్షమునకు నామములు. Plantain tree. అనుగము, సొఱకాయ, వపరు, యీ 3 ను, కుంబీకలాటువునకు ఆహ్వయములు. Gourd తాడు, తాడి, ఈ ౨ ను, తాళివృక్షమునకు నామములు. Palmyra tree.

సీ॥ మొక్క, మోక, నిసువు, మొలక, మో, సనఁగ నం
కురమునకును బేళ్ళు (కుధరచాప!)
యిగు, రనఁ దలిరు, నాఁ జిగురు, నాఁ జివు, రనఁ
బల్లవనామముల్ పరగు (నీశ!)
మ్రా, ననఁ జె, ట్టన మ్రాఁ, కన భూరుహ
నామధేయములగు (వామదేవ!)
పువు, పువ్వు, పూ, నాఁగఁ బువ్వము, విరి, యల,
రనఁ గుసుమాఖ్యలై యలరు (నీశ!)
తే॥ గుబురు, దట్టము, జొంపంబు, గుంపు, తఱుచు,
నాఁగ నిబిడంబు పేళ్ళొప్పు (నందివాహ!)
వల్లరిసమాఖ్య లగుచు వర్తిల్లుఁ దీఁగ,
తీవ, తీవియ, తీవె, నాఁ (త్రిపురవైరి!) 7

టీ॥ కుధరచాప ! ఈశ ! వామదేవ ! నందివాహ ! త్రిపుర వైరి ! కాశీవిశ్వేశ్వరా ! మొక్క, మోక, నిసువు, మొలక, మోసు, యీ ౫ ను, అంకురమునకు నామములు. A sprout. ఇగురు, తలిరు, చిగురు, చివురు, యీ ౪ ను, పల్లవమునకు నామములు. A tender leaf మ్రాను, మాను, చెట్టు మ్రాఁకు, యీ ౪ ను, భూమిజమున కాహ్వయములు. Tree పువు, పువ్వు, పూ, పువ్వము, విరి, అలరు, యీ ౬ ను, గుసుమమునకు నామములు. Flower. గుబురు, దట్టము, జొంపము, గుంపు, తఱచు

ఈ ౫ ను, నిబిడమునకు సమాఖ్యలు. Thickest. తీఁగ, తీవ, తీవియ, తీవె, తీఁగె, యీ ౪ ను, లతకుఁ బేర్లు. Creeper

ఆ॥ అగ్రమున కభిఖ్యలగుచుండుఁ దుద, సుద,
కొన, యనంగ, వృక్షకోటరమున
కలరుఁ బేస్ళు తొఱ్ఱ, తొలి, తొఱ్ఱు, తొఱ, నాఁగ
(నాగహార! రజతనగవిహార!) 8

టీ॥ నాగహార! రజత నగ విహారా! విశ్వేశ్వరా! తుద, సుద, కొన, ఈ 3 ను, అగ్రమున కభిఖ్యలు. End తొఱ్ఱ, తొలి, తొఱ్ఱు, తొఱ, ఈ ౪ ను, తరుకోటరమునకు నామములు.
Hollow in a tree

ఆ॥ ఇక్షువున కభిఖ్య లీక్షితిఁ గన్నుల
మ్రాను, చెఱకు, తియ్యమ్రా, ననంగఁ,
దనరు దవ, యనంగఁ దలవాఁడె, నాఁగఁ ద
దగ్రమున కభిఖ్యలగు గిరీశ! 9

టీ॥ గిరీశా! కన్నులమ్రాను = కణుపులుగల తరువు, చెఱకు, తియ్యమ్రాను, ఈ 3 ను, ఇక్షువునకు సమాఖ్యలు. Sugarcane. దవ, తలవాఁడె, ఈ ౨ ను, ఇక్షు నగ్రమునకుఁ బేర్లు. Top of a Sugarcane.

క॥ అగుఁ బేళ్ళుత్పలమునకుం
దొగ,తొవ,గల్వ, గలు, వనఁగఁ దోయజమొప్పుం,
దగ, దమ్మి, తామ, రనఁగా;
మొగ, డన మొగ్గ, యనఁ దనరు ముకుళంబు శివా!

టీ॥ శివా! తొగ, తొవ, కల్వ, కలువ, ఈ ४ ను, ఉత్పల మున కభిఖ్యలు. A water lily. తమ్మి, తామర, ఈ ౨ ను, పద్మమునకుఁ బేర్లు. Lotus మొగడ, మొగ్గ, ఈ ౨ ను, ముకుళమున కాఖ్యలు. A bud

తే॥ ఎసఁగు జెందొగ, చెందొవ, యెఱ్ఱకలువ,
యనఁగ రక్తోత్పలంబు; రక్తాబ్జ మొప్పు
నిలను గెందమ్మి, కెందామ, రెఱ్ఱదామ,
రనఁగఁ జెందమ్మి, చెంధామ, రన(మహేశ!) 11

టీ॥ మహేశా! చెందొవ, చెందొగ, ఎఱ్ఱకలువ, ఈ 3 ను, రక్తోత్పలమునకు నాఖ్యలు. Red lily కెందమ్మి, కెందామర, ఎఱ్ఱతామర, చెందమ్మి, చెందామర, ఈ ౫ ను, అరుణాంబుజ మున కాహ్వయములు. Red lotus.

క॥ గొడువు, గొడు, గెల్లి, యనఁ జె
న్నడరును ఛత్రంబు, గేతనాహ్వయములగుఁ
సిడె, మనఁగ డెక్కె, మనఁగాఁ
బడగ, యనన్ డా, లనంగఁ (బర్వతధన్వీ!) 12

టీ॥ పర్వతధన్వీ! గొడుగు, గొడువు, ఎల్లి, ఈ 3 ను, ఛత్ర మునకు నాఖ్యలు. Umbrella. సిడెము, టెక్కెము, పడగ డాలు, ఈ ४ ను, కేతనమునకు నాహ్వయములు. A flag.

క॥ మఱుఁ, గనఁగ నోల, మనఁగా
మఱు, వనఁగాఁ జా, టనంగ మా, టన వరుసం
బరఁగు న వెల్ల నగోచర
ధరణీనామంబు లగును (దర్పకదమనా!) 13

టీ॥ దర్పకదమనా ! = స్మరాంతకా ! మఱుగు, ఓలము, మఱువు, చాటు, మాటు, ఈ ౫ ను, అగోచరస్థానమునకు నాహ్వయములు. Hidden place

క॥ హొసఁగుఁ దృణాఖ్యలు పులు, నాఁ
గస, వనఁగాఁ బూరి, యనఁగ, గడ్డి యనంగా
వసుమతిలో నెన్నంబడు
ససి, సస్సెము, పై, రనంగ సస్యం బభవా! 14

టీ॥ అభవా ! పులు, కసవు, పూరి, గడ్డి, ఈ ౪ ను, దృణమునకు నామములు. Grass ససి, సస్సెము, పైరు, ఈ 3 ను, సస్యమునకు నాహ్వయములు. Crop

ఆ॥ తెలుపు, తెల్ల, వెల్ల, తెలి, వెలి, నాఁగ నా
హ్వాయము లమరు ధవళవర్ణమునకుఁ,
గప్పు, నలుపు, నల్ల, కఱి, యన నాఖ్యలౌ
నీలవర్ణమునకు నీలకంఠ! 15

టీ॥ నీలకంఠ ! = తెలుపు, తెల్ల, వెల్ల, తెలి, వెలి, ఈ ౫ ను, ధావళ్యమునకు నాహ్వయములు. White కప్పు, నలుపు, నల్ల, కఱి, ఈ ౪ ను, నీలవర్ణమునకు నామములు. Black

ఆ॥ కెంపు, తొగరు, తొవరు, గెంజాయ, యెఱు, పెఱ్ఱ
యనఁగ నరుణకాంతి కాఖ్యలయ్యె;
నళిది, పసుపుచాయ, యనఁగ హారిద్రవ
ర్ణమున కాఖ్యలగుఁ బినాకహస్త ! 16

టీ॥ పినాకహస్త ! కెంపు, తొగరు, తొవరు, కెంజాయ, ఎఱుపు, ఎఱ్ఱ, ఈ ౬ ను, అరుణకాంతిక నాహ్వయములు. Red

అరిది, హళది, పసుపుచాయ, ఈ 3 ను, హరిద్రవర్ణమునకు నాహ్వాయములు. Yellow

ఆ॥ శ్యామవర్ణమునకు నామంబులగుచుండుఁ
పసరుచాయ, యనఁగఁ బచ్చ, యనఁగ
వన్నె, డాలు, రంగు, వన్నియ జిగి, జోతి,
చాయ, యనఁగఁ బరఁగు జగతిఁ గాంతి. 17

టీ॥ పసరుచాయ, పచ్చ, ఈ ౨ ను, ఆకుపచ్చ, శ్యామ వర్ణముకు నామములు. Green వన్నె, డాలు, రంగు, వన్నియ, జిగి, జోతి, చాయ, ఈ 3 ను, కాంతికిఁ బేర్లు. Colour

తే॥ మానికము, లన రతనముల్, నా నెసఁగు
నవని మాణిక్యములకు సమాహ్వాయములు;
మెఱుఁ, గనంగను నిగ్గు, నా మెఱయుచుండు
నాఖ్య లుత్కృష్టకాంతికి (నభ్రకేశ!) 18

టీ॥ అభ్రకేశ! మానికము, రతనము, ఈ ౨ ను, మాణి క్యాఖ్యలు. Gem మెఱుఁగు, నిగ్గు, ఈ ౨ ను, ఉత్కృష్టకాం తికి నాఖ్యలు. Brilliance.

తే॥ జలధి పేళ్లగు మున్నీరు, కడలి, సంద్ర
మనఁగ మడుఁ, గన మడువు, నా హ్రదము, దనరు
బరఁగు నాఱవసంద్రంబు, పాలవెల్లి,
జిడ్డుకడలి, పాల్కడలి, నా క్షీరజలధి. 19

టీ॥ మున్నీరు, కడలి, సంద్రము, ఈ 3 ను, జలనిధి నామములు. Ocean. మడుగు, మడువు, ఈ ౨ ను, హ్రద మున కాఖ్యలు, A deep lake. ఆఱవసంద్రము పాలవెల్లి,జిడ్డు,

కడలి=జడ్డుగలనీరధి, పాలకడలి = క్షీరసముద్రము, ఈ ౪ క్షీరజలధికి నాహ్వాయములు. Ocean of milk.

క॥ నంజె, యన మడి, యనఁగను
మంజుల కేదార భూ సమాఖ్యలు వెలయుం
బుంజె, యనఁ జేను, పొల, మన
గం, జను మరుభూమి పేళ్ళు (కాయజదమనా!) 20

టీ॥ కాయజదమనా ! = స్మరాంతకా ! = నంజె, మడి, ఈ ౨ ను, తరిభూమికి నామములు. Irrigated land పుంజె, చేను, పొలము, ఈ 3 ను, మెఱకభూమి కాఖ్యలు. Land of dry cu ltivation. గంజ, ఇదిమరుభూమికిఁబేరు.a dry waste land.

క॥ ధరణిఁ వివరాఖ్యలగుఁ
బొఱియ,కలుగు,లాగ, బొక్క, బొంద, యనంగా;
దరి, యొడ్డు, గ, ట్టనంగా
బరఁగుం దీరంబు పేళ్ళు ప్రమథగణేశా! 21

టీ॥ ప్రమథగణేశా ! = ప్రమథగణముల కధిపతివైన ఈశ్వరా ! బొఱియ, కలుగు, లాగ, బొక్క, బొంద, ఈ ౫ ను, వివరమునకుఁ బేర్లు. Hole దరి, ఒడ్డు, గట్టు, ఈ 3 ను, తీరంబునకుఁ బేర్లు. Bank

తే॥ అన, లనంగను టొంపి, నా నడు, సనంగ
బురద, నా నొప్పు గర్దమంబునకుఁ బేళ్ళు;
భూమికి సమాఖ్యలగు బువి, పుడమి, నేల,
మన్ను, పంటవలంతి, నా (మదనదమన!) 22

టీ॥ మదనదమన ! = విశ్వేశ్వరా ! భావజాంతకా ! అసలు తొంపి, అడుసు, బురద, ఈ ४ ను, గర్దమమున కాఖ్యలు. Mire బువి, పుడమి, నేల, మన్ను, పంటవలంతి, ఈ ౫ ను, భూమి కభిఖ్యలు. Earth

తే॥ జగిలె, యనఁగ నరుఁగు, నాఁగ జగతి, నాఁగఁ
దిన్నె, యన వేదికాఖ్యలై యెన్నఁ దనరు
మి, ట్టనంగను మెఱక, నా మిట్ట, యనఁగ
నున్నతక్షితి కాఖ్యలై యొప్పు (నభవ!) 23

టీ॥ అభవా ! = భవరహితుఁడవైన విశ్వేశ్వరా ! జగిలె (జగ్గిలె), అరుఁగు, జగతి, తిన్నె, ఈ ४ ను, వేదికకుఁ బేర్లు. Pial మిఱ్ఱు, మెఱక, మిట్ట, ఈ 3 ను, ఉన్నతస్థానమునకు నభిఖ్యలు. High ground

తే॥ తనరు నిశ్రేణి, తాప, నిచ్చెన, యనంగఁ
దెప్ప, తే, పను నాఖ్యలు నొప్పుఁ; బ్లవము
పరఁగు నో, డనఁ గల, మనఁ దరణి, ధరణిఁ,
(దరణిశీతాంశుశిఖినేత్ర! ధవళగాత్ర!) 24

టీ॥ తరణిశీతాంశుశిఖినేత్ర! = సూర్యుఁడు, చంద్రుఁడు, అగ్ని ఈ ముగ్గురిని నేత్రములుగాఁగలవాఁడా ! ధవళగాత్ర ! = తెల్లని శరీరముగలవాఁడా! తాప, నిచ్చెన, ఈ ౨ ను, నిశ్రేణికి నామములు. Ladder తెప్ప, తేప, ఈ౨ను, బ్లవమునకు నభిఖ్యలు. Boat. ఓడ, కలము, ఈ ౨ ను, నావకుఁ బేర్లు. Ship.

తే॥ కార్ముకం, బొప్పు విల్లు, సింగాణి, యనఁగఁ;
దూణి, మొప్పు బత్తళిక, నా దొన, యనంగ

దరకసంబు, బసఁ బొదిఁ, యనఁ; దనరు శరము,
కోల, ములి, కమ్మ, తూఁపు, నా (శూలపాణి!) 25

టీ॥ శూలపాణి! విల్లు, సింగాణి, ఈ ౨ ను, గార్ముక
మున కాఖ్యలు. Bow. బత్తళిక, దొన, తరకసము, పొది, ఈ ౪
ను, తూణీరమున కాఖ్యలు. Quiner. కోల, ములికి, అమ్ము,
తూఁపు, ఈ ౪ ను, శర సమాఖ్యలు. Arrow

తే॥ తనరుఁ బేర్మి తను, త్రాణమునకుఁ గత్త
ళంబు, జోడు; జిరా, దుప్పటంబు, బొంద
ళం, బనఁగ; నాఖ్యలగు శతాంగంబునకును
దేరు, నా నరదము. నాఁగ మేరుచాప! 26

టీ॥ మేరుచాప! కత్తళము, జోడు, జిరా, దుప్పటము,
బొందళము, ఈ ౫ ను, తనుత్రాణమునకు నామములు.
Armour తేరు, అరదము, ఈ ౨ ను, శతాంగమున కాఖ్యలు.
Chariat.

క॥ కన్నా, కన్నను దలక,
ట్టన్నను మఱి మేలుబంతి, యన్నను ధరలో
నిన్నియు శ్రేష్ఠము పేళ్లై
యెన్నంబడు రాజసభల నిభదైత్యహరా! 27

టీ॥ ఇభదైత్యహరా! = గజాసురాంతకా! కన్నాకు, తల
కట్టు, మేలుబంతి, ఈ 3 ను, శ్రేష్ఠమునకుఁ బేర్లు. noble

క॥ సొ, మ్మనఁ దొడ, వనఁగా రవ
ణ, మ్మన నగుఁ బేర్లు భూషణమ్ములకును హా

రమ్ములకు నగు నభిధా
నమ్ములు పేరు, లన సరులు, నా (శితికంఠా!) 28

టీ॥ శితికంఠా ! = కంఠమునందు నలుపుగలవాఁడా ! సొమ్ము, తొడవు, రవణము. యీ 3 ను, భూషణమునకుఁ బేర్లు. Jewel పేరు, సరి, ఈ ౨ ను, కంఠహారమున కాఖ్యలు. Necklace

తే॥ సరము, లెత్తులు, దండలు, సరు, లనంగ
నామధేయంబులగుఁ బుష్పదామములకు;
వాసనకు నాఖ్యలై యొప్పు వలపు, కంపు,
తావి, కమ్మన, యనఁగఁ (గాత్యాయనీశ!) 29

టీ॥ కాత్యాయనీశ ! = పార్వతీశ్వరా ! సరములు, ఎత్తులు దండలు, సరులు, యీ ౪ ను, పుష్పమాలికల కాఖ్యలు. A grrland of flowers వలపు, కంపు, తావి, కమ్మన, యీ ౪ ను, వాసనకు నాఖ్యలు. Smell

క॥ ఒడమె, యన సొ, మ్మనంగా
విడిముడి, యన రొక్క, మనఁగ విత్తంబునకుం
బుడమిని నామములగు నివి
(ఉడురాజకళావతంస! యురగాభరణా!) 30

టీ॥ ఉడురాజకళావతంస!=చంద్రకళయే భూషణముగాఁ గలవాఁడా ! ఉరగాభరణ ! = సర్పములను ఆభరణములుగా దాల్చినవాఁడా ! ఒడమె, సొమ్ము, విడిముడి, రొక్కము, యీ ౪ ను, విత్తమునకు నాహ్వయములు. Money

తే॥ మచ్చు, లన మిద్దె, లనఁగను మాడుగు, లన
దారునిర్మితగేహముల్ దనరుచుండుఁ;
బరగు సౌధంబు మేడ, యుప్పరిగ, యనఁగ
(నాగకేయూర ! మౌనిమానసవిహార !) 31

టీ॥ నాగకేయూర ! = సర్పములను అంగదములుగాధరించినవాఁడా! మౌనిమానసవిహార ! = మునీశ్వరుల మనస్సులయందు విహరించువాఁడా మచ్చులు, మిద్దెలు,మాడుగులు,(రూ) మాడువులు, ఈ 3 ను, కొయ్యచేత నిర్మింపఁబడిన యిండ్లకు నామములు. Houses of wood Terraced houses ఉప్పరిగ మేడ, యీ ౨ ను, రాజనగరములకుఁబేర్లు. Royal mansion.

తే॥ పెట్టి, యన మందసం, బనఁ, బెట్టె యనఁగఁ
బెట్టియ, యనంగఁ బేటికాభిఖ్య లమరు;
మ్రోఁ, డనంగను, మోటు, నా మొ, ద్దనంగ
వెలయు స్థాణుసమాఖ్యలు (విశ్వనాథ!) 32

టీ॥ విశ్వనాథా ! పెట్టి, మందసము, పెట్టె, పెట్టియ, ఈ ౪ ను, బేటికాహ్వయములు. A chest. మ్రోడు, మోటు,మొద్దు యీ 3 ను, స్థాణువునకుఁ బేర్లు. The trunk of a tree.

ఆ॥ విస్తృతాఖ్య లొప్పు విప్పు తనర్పు, నా
వెడఁద, విరివి, పఱపు, వెడలు పనఁగ;
దీర్ఘమునకు నామధేయంబులై యొప్పు
నిడుద, చాపు, నిడివి, నిడు పనంగ. 33

టీ॥ విప్పు, తనర్పు, వెడఁద, విరివి, పఱపు, వెడలుపు, యీ ౬ ను, వెడలుపున కాఖ్యలు. Width నిడుద, చాపు, నిడివి, నిడుపు, ఈ ౪ను, దీర్ఘమున కాహ్వయములు. Length.

ఆ॥ ఈడు, దినుసు, సాటి, ఎన, దొర, సరి, జోడు,
సవతు, మాద్రి, యుద్ది, జత, తరంబు,
పురుడు, నాఁగ సదృశమున కివి యాఖ్యలౌ
వివిధగుణసనాథ! విశ్వనాథ! 34

టీ॥ వివిధగుణసనాథ ! = వివిధములైన గుణములసంపత్తి గలవాఁడా ! విశ్వనాథ ! ఈడు, దినుసు, సాటి, ఎన, దొర, సరి, జోడు, సవతు, మాద్రి, (మాదిరి) ఉద్ది, జత, తరము, పురుడు, ఈ౧3ను, సదృశత్వమునకు నాఖ్యలు. Equality, Similarity.

తే॥ పసిఁడి, బంగరు, బంగారు, పైఁడి, పొన్ను,
జాలువా, పుత్తడి, యనంగ స్వర్ణ మమరుఁ;
దప్తకాంచన మమరుఁ గుందన, మనం గ
డాని, యపరంజి, నాఁ గజదానవారి! 35

టీ॥ గజదానవారి ! = గజాసురవిరోధీ ! పసిఁడి, బంగరు, బంగారు, పైఁడి, పొన్ను, జాళువా, పుత్తడి, యీ౭ను, స్వర్ణము నకుఁ బేరులు. Gold. కుందనము, కడాని, అపరంజి, ఈ3ను, పుటము వేయఁబడిన బంగారమున కాహ్వయములు. Refined Gold.

ఆ॥ చిదుర, తునుక, తునియ, చిదురుప, వ్రక్క, పా,
లనఁగ ఖండమునకు నాఖ్య లమరుఁ;
బ్రోగు, గుప్ప, వామి, పోగ్రివు, తిట్ట, యనంగ
రాశి కాఖ్యలగు ధరాశతాంగ! 36

టీ॥ ధరాశతాంగ ! = భూమినిరథముగాఁజేసికొన్నవాఁడా ! చిదుర, తునుక, తునియ, చిదురుప, వ్రక్క, పాలు, యీ ౬ నుఁ

ఖండ సమాఖ్యలు. Fragment. పోగు, కుప్ప, వామి, ప్రోవు, తిట్ట, యీా ౫ ను, రాశి కాహ్వాయములు. Heep pila.

క॥ ఈ స్థావరవర్గం గడు
నాస్థ౯ వినc జదువc వ్రాయ నవనీస్థలిలో
నా స్థాణుని కృప నఖిల శు
భస్థితులును జనుల కొదవు భాసురలీల౯. 37

టీ॥ ఈ స్థావరవర్గును, విన్నవారికినిc, జదివినవారికిని' వ్రాసిన వారికిని, ఈశ్వరుని కృపవలన, సకల శుభములును గలుగును.

స్థావరవర్గు సమాప్తము.



•

# తిర్యగ్వర్గు

——:0:——

## Names of Animals

సీ॥ వెడఁదమోముమెకంబు, జడలమెకం, బేనుఁ
గులగొంగ, మెకములకొలముసామి,
తెల్లడాలు మెకంబు, తెఱనోటిమెకము, సిం
గంబు, నా బొబ్బమెకం బనంగఁ;
బరఁగును మృగరాజు, పసిదిండి, పులి మెకం
బులతిండిపోతు, చాఱలమెకంబు,
మువ్వన్నె మెక, మన నివ్వసుంధరయందు
వ్యాఘ్రంబునకు సమాఖ్యలు చెలంగుఁ;
ఆ॥ బుట్టకూడుతిండిపో, తన వెనుకచూ
పులమెకంబు, నాఁగ నెలు వనంగ
నెలుఁగు, నాఁగ మోరతెలుపుమెకంబు, నా
భల్లుకంబు దనరు (ఫాలనేత్ర!) 1

టీ॥ ఫాలనేత్రా! వెడఁదమోముమెకము = విశాలమైన ముఖముగల మెకము, జడలమెకము = జడలుగల మృగము, ఏనుఁగులగొంగ = సామజములకు శత్రువు, మెకములకొలము, సామి = మృగముల కులమునకు ప్రభువు, తెఱనోటి మెకము = తెఱచియుండు నోరుగలమృగము, సింగము = సింహము, బొబ్బ

మెకము = బొబ్బలు వేసెడు మృగము, యీ ౮ ను, మృగరాజ నామములు. Lion. పసుతిండి = పశువులను దినునది, పులి మెకంబుల తిండిపోతు = మృగములను దినునది, చాఱల మెకము = చాఱలుగల మృగము, మువ్వన్నె మెకము= మూఁడు వన్నెలుగల మృగము, యీ ౫ ను, పెద్దపులి నామములు. Tiger పుట్టకూడుతిండిపోతు = పుట్టకూడు దినునది, వెనుక చూపుల మెకము = వెనుచూపుగలమృగము, ఎలువు, ఎలుఁగు, మోరతెల్పు మెకము = మోరయందుతెల్లఁదనముగలమృగము, యీ ౭ ను భల్లుకమునకుఁ బేర్లు. Bear.

కll పలుగొమ్ముల మెక మనఁగా;
నిల నెక్కుడు మెక, మనంగ నేనుఁ, గనంగా
బలువంజ మెకము, నా జే
గలమెక, మన గౌ, రనంగఁ గరి యొప్పు శివా! 2

టీll శివా! పలుగొమ్ముల మెకము = దంతములే కొమ్ములుగాగల మెకము, ఎక్కుడు మృగము = ఆరోహణార్థమైన మెకము, ఏనుఁగు, బలువంజ మెకము, (బలుహజ్జ మెకము) బలువైన పాదములుగల మెకము, చేగల మెకము = కరముగల మృగము, (తొండము), గౌరు, యీ ౬ ను, ఏనుఁగుకుఁ బేర్లు, Elephant.

తేll వాజికి సమాఖ్యలగుఁ దేజి, వారువంబు,
మావు, గుఱ్ఱంబు, తట్టువ, వావురంబు,
కత్తలాని, బాబా, జక్కి, తత్తడి యన;
విగతభవపాశ! కాశీనివేశ! యీశ! 3

టీ॥ విగతభవపాశ! = పోఁగొట్టఁబడిన సంసారబంధ గల వాఁడా! కాశీనివేశ! ఈశ! తేజి, వారువము, మావు, గుఱ్ఱము, తట్టువ, వావురము. కత్తలాని, బాబా, జక్కి, త్రడి, యీ ౧౦ ను అశ్వమునకు నామములు. Horse.

క॥ తగ, ఏడిక, పొట్టే, లన
నగు మేషసమాఖ్య; లెనిమిదడుగులమెక, మే
నుఁగుగొంగ సూఁ, డనంగా
జగతిఁ శరభాఖ్య లొప్పుఁ (జంద్రార్ధధరా!) 4

టీ॥ చంద్రార్ధధరా! = బాలచంద్రుని ధరించిన విశ్వేశ్వరా! తగరు. ఏడిక, పొట్టేలు, యీ 3 ను, మేషమునకు నామములు. Goat, Ram ఎనిమిదడుగుల మెకము = ఎనిమిది పాదములుగల మృగము, ఏనుఁగుగొంగసూఁడు = గజారియగుపంచాస్యమునకు శత్రువు, యీ ౨ ను శరభమృగమునకు నామములు.
A griphon.

క॥ సంగతి నుష్ట్రాఖ్యలు నొ
ప్పెం గడు నొంటె, లన లొట్టిపిట్ట, లనన్; సా
రంగాఖ్య లలరు నిఱ్ఱు, ల
నంగా జింక, లన లేళ్లు నా (సర్వజ్ఞా!) 5

టీ॥ సర్వజ్ఞా! యీశ్వరా! ఒంటె, లొట్టిపిట్ట. యీ ౨ ను, ఉష్ట్రమున కాహ్వయములు. Camel. ఇఱ్ఱి జింక, లేడి, యీ 3 ను, జింకలకు నాఖ్యలు. Deer.

క॥ నులిగొమ్ములమెక, మి, ఱ్ఱన
నిల మృగమున కొప్పుఁ బేళ్లు మృగి లేడి, యనఁ

వెలయును; రెంటికిఁ దగునా
ఖ్యలుజింక యనంగ నీశ! యంబరకేశా! 6

టీ॥ అంబరకేశా ! = ఆకాశమే జుట్టుగాగలవాఁడా ! నులి గొమ్ములమెకము = మెలికలు తిరిగియుండు కొమ్ములుగల మెకము, ఇఱ్ఱి, యీ ౨ ను, మగదైన జింకకు పేర్లు. Buck. లేడి యనునది యాడుజింకకు నామము. జింక = ఇది యాఁడు దుప్పికిని, మగ దుప్పికిని పేరు. Deer, Doe.

తే॥ పసులు, తొడుకులు, పసరముల్, పసి, యనంగఁ,
బశువులకును సమాఖ్యలై పరగు; నాల
పోఁతు, బసవఁడు, గిబ్బ, యాఁబో, తనంగ
వృషభమున కాఖ్యలై యొప్పు వృషభవాహ! 7

టీ॥ వృషభవాహ ! = ఎద్దునెక్కువాఁడా ! యీశ్వరా ! పసులు, తొడుకులు, పసరము, పసి, యీ ౪ ను, పశు సమాఖ్యలు. Cattle ఆలపోఁతు, బసవఁడు, గిబ్బ, ఆఁబోతు, యీ ౪ ను, వృషభమునకు నాఖ్యలు. A Bull.

సీ॥ త్రొక్కుపట్టు, లనంగ దొ, డ్లనఁగా నివి
గోష్ఠదేశమునకుఁ గొలలు (నీశ!)
కదుపులు, మొదవులు, పదువులు, మందలు,
నాధేనుగణ మొప్పు (నగనివేశ!)
అలరు నాఖ్యలు లేఁగ, లన దూడ, లనఁ గ్రేపు,
లన వత్సములకును (ధనదమిత్ర!)
ఆ. వనఁగా గిడ్డి, యనఁ దొడు, కన మొద,
వన ధేనునామముల్ తనరు (నభవ!)

తే॥ యుక్షమునకు సమాఖ్యలై యొప్పుచుండు
గిత్త, యె, ద్దన గోడె, నాఁ (గృత్తివాస!)
యా, లనఁగ ధేనువుల కాఖ్య యలరుచుండు
(శైలజానాథ! ప్రమథసంచయసనాథ?) 8

టీ॥ యాక! నగనివేశ! ధనపమిత్ర! = కుబేర సఖా! అభవ! కృత్తివాస! = చర్మమును వస్త్రముగాఁ దాల్చువాఁడా! శైలజానాథ! = పార్వతీపతీ! ప్రమథసంచయనాథా! = ప్రమథగణములతోఁ గూడుకొన్న దేవా! తొట్టుపట్టులు, దొడ్లు, యీ౨ను, బసుల కొట్టమునకు నామములు. Cowshed. కదుపులు, మొదవులు, పదువులు, మందలు, యీ ४ ను, ధేనుగణమునకుఁ బేర్లు. Cow-herd. లేఁగ, దూడ, క్రేపు, యీ 3 ను, గోవత్సములకుఁ బేర్లు. Calf ఆవు, గిడ్డి, తొడుకు, మొదవు, యీ ४ ను, ధేను నామములు. Cow. గిత్త, ఎద్దు, కోడె, యీ 3 ను, వృషభాఖ్యలు. ఆలు ఇది ఆవు. శబ్దమునకు బహువచనము.

తే॥ అలరుఁ గుందేలు, చెవులపో, తనగ శశక
మొప్పుఁ; బొడలమెకంబు, నా దుప్పి, యనఁగ
గాఱుకొమ్ముల మెక, మనంగను ధరిత్రి;
రామనామమృగంబు ధరాశతాంగ! 9

టీ॥ కుందేలు, చెవులపోతు యీ ౨ ను, శశకమునకుఁ బేర్లు. Hare పొడలమెకము, మచ్చలుగల మెకము, దుప్పి, కాఱుకొమ్ముల మెకము = దట్టమైన శృంగములుగల మృగము.
A deer having spots and braching horne.

తే॥ దుంత. యెనుబోతు, జమునెక్కిరింత, దున్న,
యనంగ మహిషంబునకు సమాహ్వయము లమరు

బరగ నెనుపెంట్లు, గేదెలు, బఱ్ఱె, లెనుము,
లనఁగ మహిషీ సమాఖ్యలు ధనదమిత్ర! 10

టీ॥ ధనదమిత్రా! దుంత, ఎనుబోతు, జమునెక్కరింత, దున్న, ఈ ౫ ను, మహిషమునకాఖ్యలు. Buffalo. ఎనుపెంట, గేదె, బఱ్ఱె, ఎనుము, ఈ ౪ ను, మహిషి సమాఖ్యలు.

She Buffalo

తే॥ పక్కి, పులుఁగు, పిట్ట, యనంగఁ బక్షి యెప్డు;
గఱులు, ఱెక్కలు, చట్టుప, లెఱక, లనఁగఁ
బక్షములు కివి పేళ్ళగుఁ; బర్ణములకు
నాఖ్య లగు లాపు లన నీఁక, లనఁగ(నీశ!) 11

టీ॥ ఈశ! పక్కి, పులుఁగు, పిట్ట, ఈ 3 ను, విహంగమునకుఁ బేర్లు. A bird. గఱులు, ఱెక్కలు, చట్టుపలు, ఎఱకలు, ఈ ౪ ను, పక్షమునకు నామములు. Wings. లాపు, ఈఁక, ఈ ౨ ను, నీఁకలకుఁ బేర్లు. Feathers.

సీ॥ తొలకరికలుగు పుల్గులు, నల్వతేజీలు,
పాలనీరును వేఱుపఱచు పులుఁగు,
లంచలు, తెలిపిట్ట, లన నొప్పు హంసలు;
క్రౌంచముల్ దనరారుఁ గొంచ లనఁగ;
గొక్కరా లనఁగను గొక్కు లనంగను
గొక్కెర, లనఁగను గొంగ, లనఁగఁ
బరఁగు నభిఖ్యలు బకవిహంగములకు;
నట్టువపులుఁగు, నా జుట్టుపులుఁగు,

తే॥ నాఁగ నె, మ్మన నెమిలి, నా నమ్మి, యనఁగఁ
గేకికి సమాఖ్యలగుఁ; జంచరీకములకు
నాఖ్యలు జమిలిముకాలి, యనఁగఁ దేఁటి,
యనఁగ దుమ్మెద, నా (సీశ! యభ్రకేశ!) 12

టీ॥ ఈశ! అభ్రకేశ! తొలకరికలుగుపులుఁగులు = వర్ష కాలమును ద్వేషించు పక్షులు, నల్వతేజీలు = బ్రహ్మదేవునకు వాహనములు, పాలునీరును వేఱుపఱచు పులుఁగులు = క్షీరనీర భేదము నిర్ణయించు పక్షులు, అంచలు, తెలిపిట్టలు, ఈ ౫ ను, హంస నామములు. Swans. కొంచలు ఇది క్రౌంచపక్షులకుఁ బేరు. Heron. కొక్కరా, కొక్కు, కొక్కెర, కొంగ, ఈ ౪ ను, బక నామములు. Cranes. నట్టువపులుఁగు = నర్తనముసేయు విహంగము, జుట్టుపులుఁగు = శిఖగల విహంగము, నెమ్మి, నెమిలి, నమ్మి, ఈ ౫ ను, శిఖి నామములు. Peacock. జమిలి ముకాలి = ఆఱు చరణములు గలది, తేఁటి, తుమ్మెద, ఈ 3 ను, బంభరము పేర్లు. Bee.

తే॥ పరగు నొడ్డీలు, కూకీలు, పల్లటీలు,
పావురాలును, బకదార్లు, పావురములు,
నాఁగఁ గలరవపక్షిబృందముల పేర్లు
పంకజాతాక్ష! సన్మిత్రఫాలనేత్ర! 13

టీ॥ పంకజాతాక్ష సన్మిత్ర != విష్ణుసఖుడా! ఫాలనేత్ర != త్రిలోచనా! ఒడ్డీలు, కూకీలు, పల్లటీలు, పావురాలు, బకదార్లు, పావుర ములు, ఈ ౬ ను, పారావతమునకు నామములు.

Pigeon

తే॥ పుకమిలోపలఁ జదువులపులుఁ, గనంగఁ,
జిగురువిల్కానితేజి, నాఁ దొగరుముక్కు
పులు, గనఁగఁ బచ్చఱెక్కలపులుఁ, గనంగ
జిలుక యన నొప్పుఁ గీరంబు, శ్రీమహేశ! 14

టీ॥ శ్రీమహేశ! చదువులపులుఁగు, చిగురువిల్కానితేజి = మన్మథుని వాహనము, తొగరుముక్కుపులుఁగు = ఎఱ్ఱనిముక్కు గల విహంగము, పచ్చఱెక్కలపులుఁగు = పచ్చని పక్షములుగల పక్కి, చిలుక, ఈ ౫ ను, కీరమునకుఁ బేర్లు. Parrot.

తే॥ బట్టికాఁడన గొరవంకపిట్ట, యనఁగఁ
బరఁగు శారిక; యేట్రింత, పసులపోలి
గాఁడు, కూఁకటిమూఁగ, నాఁగను జెలంగు
నిల భరద్వాజవిహగంబు (కృత్తివాస!) 15

టీ॥ కృత్తివాస! బట్టికాఁడు, (బట్టుకాఁడు) గొరవంకపిట్ట' ఈ ౨ ను, గోరువంకకు నామములు. The common myna. ఏట్రింత, పసులపోలిగాఁడు, కూఁకటిమూఁగ, ఈ 3 ను, భరద్వాజపక్షికి నామములు. King crow

తే॥ జాలె, డె, గనఁ గురుజు, నా సాళ్వ మనఁగఁ
గఱుజు, నాఁగను జిలకట్టె, యనఁగ వేస
డం, బనఁగ గిడ్డు, నా నోరణం బనంగ
శ్యేనభేదంబులగు (మహాసేన జనక!) 16

టీ॥ మహాసేనజనక! = కుమారస్వామికిఁ దండ్రియైన విశ్వేశ్వరా! జాలె, డేగ, కురుజు, సాళ్వము, కఱుజు, జిలకట్టె,

వేసడము, గిద్ద, ఓపఞము, ఈ ౯ ను, శ్యేనభేదములకు నామములు. Hawk

తే॥ కోటఁ, డనఁగను గూబ, నా ఘూక, మమరుఁ;
జిఱుతగూబ, యనంగఁ బసిండికంటి,
యనఁగ సకినాలపులు, గన నలరుచుండుఁ
బృథివిఁ గనకాక్షి యనుపక్షి (శ్రీమహేశ!) 17

టీ॥ శ్రీమహేశా ! కోటఁడు, గూబ, ఈ ౨ ను, ఘూకనామములు. Owl. చిఱుతగూబ, పసిఁడికంటి = పైడివంటి కన్ను గలది. సకినాలపులుఁగు, ఈ 3 ను, గనకాక్షి యను పక్షికి నామములు. A bird of angwy.

తే॥ పాము, సప్పంబు, నిడుపఁడు, పడగదారి,
గాలిమేఁతరి, విసదారి, కానరాని
కాళ్లయది, చిల్వ, వీనులకంటి, పుట్ట
పెట్టెప, ట్టనఁ జను నహి పేళ్ళు (భర్గ!) 18

టీ॥ భర్గ ! ఈశ్వరా ! పాము, సప్పము, నిడుపఁడు, పడగదారి, గాలిమేఁతరి=సమీరమును భక్షించునది, విసదారి = విషమును ధరించునది, కానరాని కాళ్లయది = కనపడనికాళ్లుగలది, చిలువ, (చిల్వ) వీనులకంటి = వీనులే కన్నులుగాగలది, ఈ ౧౦ ను, భుజంగము పేర్లు. Serpent.

క॥ ఇల నెసఁగు రుధిరమునకా
ఖ్యలు నల్ల, యనంగ, నెత్తు రనఁగ; ధరిత్రిం
బొల, యీరు, వెఱచి, నంజుడు,
పోల సన నివి పరఁగు మాంసమునకు (మహేశా!)

టీ॥ మహేశా! నల్లి, నెత్తురు, ఈ ౨ ను, రక్తమునకు సాహ్వయములు. Blood పాల, ఈరువు, ఎఱచి, నంజుడు, పాలసు, ఈ ౫ ను, మాంసము పేర్లు. Flesh

క॥ భర్గుడు కాశీనిలయుడుఁ
దుర్గావతి యొసఁగు ముదముతో నీ తిర్య
గ్వర్గు లిఖించినఁ జదివిన
దౌర్గత్యము లణఁచి సంపదలు నిత్యంబుఁ.

టీ॥ ఈ తిర్యగ్వర్గును వ్రాసినను, జదివినను, అట్టివారికి గాశీవిశ్వేశ్వరుఁడు కష్టములు తొలగించి సర్వసౌభాగ్యముల నొసంగును.

తిర్యగ్వర్గు సమాప్తము.



# నానార్థవర్గు

Words carrying various meanings

క॥ కలు, పనఁ బే రగు దధికిం,
గలు, పన సస్యంబులోని గాదము పేరౌ.
వెలు, గంౘు కంపకోటను
వెలుఁ, గందురు ప్రభను జనులు (విశ్వాధిపతీ!) 1

టీ॥ విశ్వాధిపతీ ! 1. కలుపు దధికిని, సస్యమునందలి కసవునకును బేరు. Curd and Weed. 2. వెలుగు కంచెకు Fence ను, వెలుఁగు = వెలుతురుకు Lig పేరు.

క॥ మావులనం దగుహయములు;
మావు లనం బరఁగు నామ్రమహీజంబు లిలం;
దావు లను స్థలము లొప్పును
దావు లనన్ వాసనలకుఁ దగుఁ బేరు (శివా;) 2

టీ॥ శివా ! 1. మావులు = గుఱ్ఱములకును Horses పేరు మావులు = మామిడిచెట్లకు Mango tree పేరు. 2. తావులు= చోట్లకు Place పేరు. తావులు=పరిమళములకును Smells పేరు. ఏకవచనరూపమగు తావియందు అర్థబేదమురాదు, బహువచనమగు తావులందే యీ అర్థద్వయము.

కII ఇమ్మహిలోపలఁ బేరగుఁ
గొమ్మ యనన్ వృక్షశాఖకును భామినికిం;
దమ్మ లనం బేరగుఁ బ
ద్మమ్ముల కనుజన్ములకును (దగుశంధుధరా!) 3

టీII తరుణేందుధరా ! కొమ్మ = వృక్షశాఖకును, ఆడుదానికినిపేరు. A branch of a tree, a woman. 2. తమ్ములు= పద్మములకును, Lotus, అనుజన్ములకును Younger Brothers పేరు.

కII ఇమ్ములఁ బేరగు తాటం
కమ్ములకుఁ లేఖలకును గమ్మలనఁగా; నా
మమ్ము దగుం గంఠాభర
ణమ్మునకును లతకుఁ దీఁగె నా గౌరీశా! 4

టీII గౌరీశా ! 1. కమ్మ = చెవికమ్మ, Earring లేఖ a letter 2. తీఁగె = మెడనూలు, a necklace of wire, లత Creeper.

కII చెల్లును బేళ్లై ధరలో
దాళ్లన సూత్రంబులకును, దాళంబులకుం;
గోళ్లనఁ గుక్కుటములకును
బేళ్లగు ఖట్వాంగములకుఁ బేళ్లగు నభవా! 5

టీII 1. తాళ్లు, పగ్గములు, Ropes, తాడిచెట్లు Palmyra tree, 2. కోళ్ళు=కుక్కుటములు. Fowls. మంచపుకోళ్ళు = Legs of cot (ఏకవచన రూపమున రెండర్థములురావు.)

క॥ చామ యన సస్యమునకును
భామినికిని నాఖ్యయగుచుఁ బరగు ధరిత్రిన్
నామములగుచును వెలయును
బాములన్ జన్మములకు భంగమ్ములకున్. 6

టీ॥ చామ = ఒక రకము ధాన్యము Willets, ఆడుఁది, Woman. బాము = పుట్టుక Birth. దుఃఖము Grief.

తే॥ దంట యనఁగ సఖిఖ్యయై తనరుచుండు
జగతిలోపలఁ బ్రౌఢకు యుగళమునకుఁ;
బఱ పనంగ నభిఖ్య యౌఁ బానుపునకు
విస్తృతమునకు (శైలనివేశ! యీశ!) 7

టీ॥ 1. దంట = ప్రౌఢాంగన a mature woman, జంట a couple, 2. పఱపు = పానుపు. A bed వ్యాప్తి. extention.

క॥ తొలి యనఁగా నగు నామం
బులు పూర్వంబునకు, సుషిరమునకును, ధరలో
వెలి యనఁగ బహిర్ధవళం
బులకును నామంబు (శేషభుజగవిభూషా!) 8

టీ॥ తొలి = పూర్వము, Formerly, బెజ్జము A hole.
2. వెలి = తెల్లని White, బయట Out side.

క॥ నెమ్మి యనన్ వంజులవృ
క్షమ్మునకున్, బర్హికిని, సుఖస్థితికిని, నా
మమ్మగుఁ దగు (నతిధీర ! య
హమ్మతిజనదూర ! పన్నగాధిపహారా !) 9

టీ॥ నెమ్మి=వంజుల వృక్షము Asoka tree. నెమిలి, Peacock. సంతోషము, Happiness.

క॥ పోలం బే రగుచుండును
బా, లనఁగా క్షీరమునకు భాగంబునకుం;
గా లన, బే రగు నాలవ
పాలికిఁ బాదంబునకును (బాలేందుధరా!) 10

టీ॥ పాలు = క్షీరము Milk. భాగముor share. కాలు= పాదము Foot.నాల్గవ భాగము a quarter.

క॥ మే లన శుభంబు పేరగు;
మే లన నుపరికిని, గూరిమికినిం, బేరౌ
మే లన మెచ్చునఁ బలికిన
యాలాపంబునకు నాఖ్యయగు జగదీశా ! 11

టీ॥ మేలు = శుభము, పై భాగము, కూర్మి మెచ్చుకొను నప్పుడు పలుకు శబ్దము.

Good, Upper. Love, Word of appreciation.

క॥ ధారణిఁ బేరు వహించును
బూరుగు నా నూఁదువాద్యమును, శాల్మ్రలియుం,
బే రన నభిధానంబగు;
హారమునకు, నామమునకు నంబరకేశా ! 12

టీ॥ 1. బూరుగు=ఊఁదువాద్యము Trumpet. బూరుగు చెట్టు The Silk cotton tree. 2. పేరు = నామధేయము, Name. దండ Necklace.

క॥ క ప్పన నీలిమ పే రగుఁ;
గ ప్పనఁగా నింటిమీఁది కసవుకుఁ బేరౌఁ!
గొ ప్పనఁదగుఁ జాపాగ్రము!
నొ ప్పగు ధమ్మిల్లమును, గృహోపరియు, శివా! 13

టీ॥ కప్పు = నలుపు, Black. ఇంటి కప్పు Roof. కొప్పు = విల్లుయొక్క కొన, top of a bow. ఆఁడువాండ్ర కొప్పు, Woman's hair. ఇంటి నడికొప్పు top of the roof,

క॥ ఒక భూరుహామునకును, ధమ
నికఁ, బే రగు గోవి యనఁగ నెఱినట్టులవే
తొక భూజమునకు, నధరము
నకుఁ, బే రగు మోవి యనిన నగరాట్చాపా! 14

టీ॥ 1. కోవి = గోరింటచెట్టు. Henna. గొట్టము Tube. (పిల్లనగోవి శబ్దమున వలె) 2. మోవి = ఒక చెట్టు a wild tree. పెదవి liy, lip.

క॥ చవు లనఁగా నభిధానము
లవు షడ్రుచులకును ముత్తియపుపెత్తులకుఁ
భువిలోపల నామములగు
గవ్వలన గుహలకును, బూతిగంధంబునకున్, 15

టీ॥ 1. చవులు = రుచులు, Tastes. ముత్తెపుసరములు, a pearl string. 2. గవులు = గుహలు, caves దుర్గంధము Bad smell.

తే॥ ఆఖ్యయై యొప్పు ధరణిలో నపర దివస
ము నకు, ఛత్రంబునకును, నెల్లి యనెడి నుడువు

జక్కి యను పేరు పరఁగును సైంధవంబు
నకు ఘరట్టంబునకును (గంధర్వదమన!) 16

టీ॥ 1. ఎల్లి = రేపు Tomorrow. ఛత్రము Umbrella-
2. జక్కి = అశ్వము Horse. తిరుగలి a grindings stone.

తే॥ ఆడె ననునది నటియించె, ననుటకును వ
చించె, ననుటకు మఱియు నిందించె, ననుట
కాఖ్య యగుచును శోభిల్లు; నాలు నాఁగ
గోవులకు భార్యకును బే రగున్ (మహేశ!) 17

టీ॥ 1. ఆడెను = నర్తనము చేసెను Danced; పలికెను, Spoke; నిందించెను, Vilified; 2. ఆలు = గోవులు, Cows. భార్య Wife.

సీ॥ రజత పునఃపదార్థములకు నభిధాన,
మగు వెండి యన; బంతి యనఁగఁ గందు
కమునకు శ్రేణికి నమరు నాహ్వాయముగా;
దండ యనన్ బుష్పదామమునకు
నంతికంబునకుఁ బే రగు, దొర యన నాఖ్య
యగు సదృశమునకు, నవనిపతికి
న స్త్రిసంఖ్యకు, నహ, మ్మనుటకు నాహ్వాయం
నగు నే, ననఁగ సరి యనగ సదృశ

తే॥ మునకు, సమసంఖ్యకును, నామముగ నెసంగు
గొం, తనఁగ నాహ్వాయంబగుఁ గుక్కుటాన
నంబునకు, గంఠమునకును, నల్ల యనిన
ర క్తనీలాఖ్యయై యొప్పు రాజమకుట! 18

టీ॥ 1. వెండి = రజతము Silver. మరల, Again, 2. బంతి = చెండు, a ball, వరుస, a row 3. దండ= పూవులదండ, a garland of flowers చేరువ, near 4. దొర = రాజు A king సమానము equality. 5. ఏను = నేను, I, అయిదు five, 6. సరి = సమానము equal సమసంఖ్య even number,7.గొంతు=కుక్కుటాసనము A manner of sitting మెడ throat, 8. నల్ల= నల్లఁదనము Black రక్తము Blood.

సీ॥ తీరంబునకు, ధరిత్రీధరంబునకు, స
మాఖ్యయై యొప్పు గట్టనఁగ (నీశ!)
కేతువునకుఁ, గాంతికిని, సమాహ్వాయమగు
డా లనఁగను (మేరుశైలచాప!)
శౌర్య ధుర్యునకు, లాంఛనములకును, నామ
మగు బిరు దనఁగఁ (బన్నగవిభూష!)
గూబ, నా నాఖ్య యౌ ఘూకంబునకుఁ, గర్ణ
మూలంబునకు (నవిముక్తనిలయ!)

తే॥ అంతికంబునకును, సమూహంబునకును,
నామమై యొప్పుఁ జేరువ నాఁగ (నభవ!)
సమభిధానమై యొప్పుఁ బిశాచమునకు,
భవమునకును, గాలి య న్పలుకు (రుద్ర!) 19

టీ॥ 1. గట్టు = పర్వతము mountain, ఒడ్డు, bank, 2. డాలు= కేతువు flag, కాంతి lustre, 3. బిరుదు=చిహ్నము little, శౌర్యధురీణుడు A champion 4. గూబ=కర్ణమూలము drum of the ear ఘూకము owl. 5. చేరువ = సమీపము

Near, గుమి a collection. 6. గాలి=గాడ్పు air దయ్యము devil.

క॥ ఇల లోపల నామంబగుఁ
బలుకులు నా శకలములకు, భాషణములకు౯
నెల యన నభిధానంబగు
జలజారికి, మాసమునకు, శైలనిశాంతా! 20

టీ॥ పలుకు = శకలము, చెక్క a bit, మాట word. 2. నెల = మాసము month, జాబిల్లి moon.

సీ॥ అంతర్హితుం డయ్యె ననుటకు నాగతుం
డయ్యె ననుటకు సమాఖ్యయగుచు,
నలరును విచ్చేసె ననుట యంబరకేశ!
నెఱి సమాహ్వాయమగు గఱచె ననఁగ
నభ్యాస మొనరించె, ననుటకు, దంతపీ
డ యొనర్చె ననుటకు, నయుగనయన
వెలయుఁ, ద ప్తక్షీరములకు, నభిజ్ఞకు
నాఖ్యయై యానవాలనుట యీశ!

తే॥ పఱచెననఁగ సమాఖ్యయౌ బాధచేసెఁ,
బ్రిచలితుండయ్యె, ననుటకుఁ బాండురంగ;
పరగ మోహించె, ననుటకుఁ, బరిమళించె
ననుట కొప్పును వలచె నా నళికనేత్ర! 21

టీ॥ 1. విచ్చేసెను = అగోచరుఁడయ్యెను disappeared, వచ్చెను Came 2. కఱచెను=కొఱికెను bit నేర్చెను learnt, 3. ఆనవాలు = గుఱుతు sign, తప్తక్షీరము heated milk.

4. పఱచెను=బాధించెను bothered, పయనమయ్యె set off.
5. వలచెను=కోరెను loved పరిమళించెను emitted scent.

సీ॥ ఆనె నంట సమాఖ్యయౌను వహించెఁ, బా
నముచెసె, ననుటకు (నగనివేశ!)
చషకంబునకును, దంష్ట్రికు నాఖ్య యౌఁ గోర
యనఁగ (శశాంకకళావతంస!)
మొకట్టిఁ డనఁగఁ గొమ్ములులేని కరికి, ము
ష్కరునకుఁ, బే రగు (గరళకంఠ!)
మరకతచ్ఛవికి, నంబరమున, కగుఁ బేరు
పచ్చడం బనిన (నంబాకళత్ర!)
తే॥ క్షితికిఁ దురగీపతికి, వృత్తశిలకు, నామ
ధేయమై యొప్పు గుండు నాఁ (త్రిపురహరణ!)
దామమౌ నొక్క సస్యంబునకును లోప
మునకుఁ గొఱ్ఱ యనంగ (నంబుదనిభాంగ!) 22

టీ॥ ఆనెను=వహించెను Bore పానముచేసెను drank
2. కోర=దంష్ట్ర fang, గిన్నె a cup 3. మొకట్టిఁడు = మూర్ఖుఁడుObstinate man, కొమ్ములులేనియేనుఁగుelephant without tusks,4. పచ్చడము = ఉత్తరీయముupper cloth మరకతకాంతి Bright-ness of an emerald, 5. గుండు = గుండ్రని రాయి a round stone, పురుషాశ్వము a male horse 6. కొఱ్ఱ = ఒక రకము ధాన్యము a kind of millet. లోపము want.

సీ॥ తాల్చు నాఖ్యలు వధూధమ్మిల్లభారంబు
గోణంబు, మూల, నాఁ (గుధరచాప!)

కొఱ యను నాఖ్యచేఁ గొఱలు లోపంబు, మ
నోజ్ఞవస్తువు, (దక్షయజ్ఞమధన!)
నెఱి హేయపడియె, నన్వేషించె, నను రెంటి
కాఖ్యయౌ రోసె నా (నసితకంఠ!)
నరసె నాఁ బేరగు నార్తి వారించె, వి
మర్శించె, ననుటకు (మదనదమన!)

తే॥ చరణమునకు, నధఃప్రదేశంబునకు, స
మాఖ్యయై యెప్పు నడుగు నా (నళికనేత్ర!)
మహినిఁ బే రగుచుండుఁ బ్రమాణకంబు
నకును భాషకు బాస నా (నగనివేశ!) 23

టీ॥ మూల=వధూధమ్మిల్లము a woman's hair knot, కోణము a corner, 2, కొఱ = మనోహర పదార్థము graceful ఒక ధాన్యము millet, 3. రోసెను = హేయపడెను hated, అన్వేషించెను searched, 4. అరసెను = ఆర్తి వారించెను soothed the pain. విమర్శించెను inquire, 5. అడుగు = పాదము foot, క్రిందప్రదేశము bottom, 6. బాస = ప్రమాణము oath, భాష language.

సీ॥ నాగవాస మన ఘంటాపత్రికమునకు
వేశ్యల కగుఁ బేరు (విశ్వనాథ!)
నామమౌ నండంబునకు, నంధకునకును
గ్రుడ్డనంగను (రౌప్యకుధరనిలయ!)
చర్మవాద్యమున కుష్ణమునకుఁ బేరగు
నుడు కనియెడు నాఖ్య (యుడుపమకుట!)

యభిధానమగు మేఁడి యన హాలాంగమునకు
దుంబరమునకును (ధూతకలుష!)

తే॥ కల్లనఁగ శిల, సురయు; నాఁ (గరళకంఠ!)
పరగు నాఖ్యలు, లాంగలపద్ధతికిని,
శ్రేణికిని, జా లనంగ (భాసితసితాంగ!
వారిధినిషంగ! కాశీనివాసలింగ!) 24

టీ॥ నాగవాసము = గంటలోనుండు చీల Iron rod in the bell, వేశ్యలు courtesans, 2. గ్రుడ్డు = అంధుఁడు A blind man, అండము egg, 3, ఉడుకు = చర్మవాద్యము, drum. వేడిమిheat, 4. మేఁడి= అత్తిచెట్టు fig tree, నాగటికి వెనుకఁ బట్టు కొయ్య ploughtail, 5. కల్లు = మద్యము toddy, ఱాయి stone, 6. చాలు = నాఁగేటి చాలు furrow, వరుస row.

తే॥ జననికిని, మాతృజననికిని, జనకజనని
కాఖ్యయగు నవ్వ యనఁగ నార్యాసహాయ!
భగినికిని, జనకునకు, నాహ్వయము దనరు
నప్ప యనఁగను జంద్రలేఖావతంస! 25

టీ = అవ్వ=తల్లి mother, అమ్మమ meternal grand mother, నాయనమ్మ paternal grandmother, 2అప్ప = అక్క elder sister, తండ్రి father.

క॥ పోతనఁగఁ బరగు మహిషము
భూతలమునఁ బురుషమృగము, బురుషఖగంబుం
దా, తన ధాతృ, పితామహ
మాతామహులకును నగు సమాఖ్య మహేశా! 26

టీ॥ 1. పోతు = దున్నపోతు Buffalo. మగపక్షి male bird. మగజంతువు male animal. 2. తాతఁ = బ్రహ్మ Brahma, తండ్రి తండ్రి father's father. తల్లితండ్రి mother's father.

క॥ పుడమినిఁ బేరు వహించును
వడిగలవాఁడనఁగ శౌర్యవంతుఁడు, జవియుః;
నడు మన నవలగ్నము చె
న్నడరగ మధ్యస్థలంబు, నగు నగధన్వీ! 27

టీ॥ 1. వడిగలవాఁడు = శౌర్యశాలి a brave man జవి= జవముగలవాఁడు a quick man. 2. నడుము = అవలగ్నము waist, మధ్యస్థానము middle place.

క॥ ఎద యనఁగ, బరగు భీతికి,
హృదయమునకు, వక్షమునకు, నిల జో డనఁగా,
నది దనరు నామ మగుచును
సదృశమునకు వర్మమునకుఁ జంద్రార్ధధరా! 28

టీ॥ 1. ఎద=భీతి, apprehention, హృదయము heart 2. జోడు = సదృశము match, కవచము armuor.

క॥ నానార్థవర్గు విది స
న్మానముతో దీనిఁ జదివినను, వ్రాసిన, నా
మానవుల కబ్బు నెప్పుడు
నానార్థంబులును విశ్వనాథుని కరుణః. 29

టీ॥ ఈ నానార్థవర్గు వ్రాసి, చదివిన మానవులకు విశ్వేశ్వరుని కరుణచే సకల సంపదలు గలుగును.

గ ద్య ము.

ఇది శ్రీమదేకామ్రమంత్రిపుత్త్ర కౌండిన్యగోత్ర
పవిత్ర, స దా రా ధి త మ హే శ్వ ర,
పైడిపాటి లక్ష్మణకవి ప్రణీతం
బైన, యాంధ్రనామసంగ్ర
హంబను నిఘంటువు
సర్వంబు నేకా
శ్వా స ము.

సటీకాంధ్రనామసంగ్రహము

స మా ప్త ము.



ఆంధ్రనామ సంగ్రహము

# అకారాది శబ్దానుక్రమణిక.

## గ.

## అకారాది శబ్దానుక్రమణిక

# పిల్లలకు ఉపయోగకరమగు పుస్తకములు

| | |
|---|---|
| | I. G. |
| తెలుగు బాలకథలు మొదటి తరగతి | 0—5—0 |
| డిటో రెండవ తరగతి | 0—6—0 |
| లఘువ్యాకరణము మూడవ తరగతి | 0—5—0 |
| డిటో నాలుగవ తరగతి | 0—6—0 |
| బొమ్మలభూగోళము, ప్రకృతిపాఠములు రెండవ తరగతి | 0—8—0 |
| కాకమ్మ కథలు | 0—5—0 |
| ఆరోగ్యపాఠావళి మొదటి తరగతి | 0—4—0 |
| డిటో రెండవ తరగతి | 0—5—0 |
| డిటో మూడు నాలుగు తరగతులు | 0—7—0 |

వలయువారు:—

కొండా శంకరయ్య
పుస్తకముల వ్యాపారము,
సికిందాబాదు, హైదరాబాదు & వరంగల్.

# తప్పొప్పుల పట్టిక.

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 6 | 7 | ఔపవిభక్తికములు | ఔపవిభక్తి |
| 10 | 12 | శతుర్థకము | శత్రర్థక |
| 13 | 20 | కృత్తులు | విభక్తు |
| 14 | 12 | సిద్ధమైన | ... మై |
| 15 | 13 | మధ్యాహ్నము | మధ్యాహ |
| — | 18 | గొంగళులవన | గొంగ |
| — | 20 | నీఱు | నీరు |
| 18 | 4 | గౌరి | గౌరీ |
| 19 | 4 | ఓషధము | ఔషధము |
| — | 3 | షణ్మాతురుడు | షాణ్మాతురుడు |
| 21 | 13 | గీతమగు | గతమగు |
| 25 | 7 | హ్రిస్వమై | హ్రస్వమై |
| — | — | దుజ్వాగకంబు | దజ్వాగ్నకంబు |
| — | 18 | జ్వాగకము | జ్వాగ్నకము |